Biku, John, Abik, Salim, All waiting for their birthdays. For their PORSCHE.



Mine was yesterday.

PORSCHE

SAMMO

CHANDAMAMA TOYTRONIX

Mfd. by :
**Chandamama Toytronix Pvt. Ltd.**
Chandamama Buildings,
188, NSK Salai, Vadapalani,
Madras - 600 026




**Remote-Control PORSCHE Toy Car**

- For the first time in India
- Indigenously manufactured
- Design from SAMMO of South Korea

FROM THE HOUSE OF CHANDAMAMA

# మన
# నూతన ప్రధాని



భారతదేశ తొమ్మిదవ ప్రధానమంత్రి శ్రీ పి. వి. నరసింహారావుగారికి చందమామ స్వాగతం పలుకుతున్నది!

ప్రతిష్ఠాత్మకమైన ప్రధానమంత్రి పదవిని, ఆంధ్ర రాష్ట్రానికి చెందిన ఒక మేధావి చేపట్టడం ఎంతయినా సంతోషించతగ్గ విషయం!

1957 వ సం॥లో రాష్ట్ర శాసనసభ సభ్యుడుగా తన రాజకీయజీవితం ప్రారంభించిన శ్రీ పాములపర్తి వెంకట నరసింహారావు గారు, రాష్ట్రంలో మంత్రిగానూ, ముఖ్యమంత్రిగానూ దక్షతతో అనేక గురుతర బాధ్యతలు నిర్వహించి, 1977 వ సం॥లో పార్లమెంటు సభ్యుడుగా జాతీయ రాజకీయ రంగంలో ప్రవేశించారు. 1980 నుంచి కేంద్రంలో మంత్రిగా—విదేశాంగ, రక్షణ, మానవ వనరుల అభివృద్ధి, ఆరోగ్యం – కుటుంబసంక్షేమం మొదలైన వివిధ శాఖలను సమర్థవంతంగా నిర్వహించారు.

దాదాపు నాలుగు దశాబ్దాలుగా, వివిధ హోదాలలో దేశ ప్రగతికి కృషి చేస్తూన్న శ్రీ పి. వి. నరసింహారావుగారు వ్యక్తిగత కారణాలవల్ల, ఈ ఎన్నికలలో పోటీ చేయలేదు. అయినా, రాజీవ్ గాంధి దారుణ హత్యానంతరం, ఆయన కాంగ్రెస్‌పార్టీ అధ్యక్షపదవిని చేపట్టవలసి వచ్చింది. ఎన్నికల అనంతరం, ఆయనను ప్రధానమంత్రి పదవిని చేపట్టమని కాంగ్రెస్‌పార్టీ, ముక్తకంఠంతో ఆహ్వానించింది.

శ్రీ పి. వి. నరసింహారావు కేవలం రాజకీయ నాయకుడు మాత్రమే కాదు. దాదాపు పది—దేశ, విదేశ భాషలలో పాండిత్యం గల సాహితీవేత్త!

రేపటి పౌరులైన, నేటి బాలలను ప్రతిభావంతులుగా తీర్చిదిద్దడానికి అనువుగా, 1986 వ సం॥లో నూతన జాతీయ విద్యావిధానాన్ని రూపొందించడంలో శ్రీ పి. వి. నరసింహారావుగారు చేసిన కృషి ప్రశంసనీయమైనది.

అనుభవజ్ఞులూ, బహుముఖ ప్రజ్ఞాశాలీ అయిన శ్రీ పి. వి. నరసింహారావుగారి నాయకత్వంలో మన దేశం ప్రస్తుత క్లిష్టపరిస్థితిని అధిగమించి, సత్వర అభివృద్ధిని సాధించాలని ఆశిస్తూ, ఆయనకు హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాము.




# మేగీ క్లబ్-అడవులలో సరదా వినోదం ఉచిత బహుమతుల ఆనందం



మేగీ 'ఆపరేషన్ వైల్డ్ లైఫ్' ఆటలో వన్యమృగాలను రక్షించండి.




మేగీ 'కింగ్ ఆఫ్ ద జంగిల్స్' ఆటలో అడవులు జయించండి.

బాలలూ రండి ! మేగీ క్లబ్‌లో చేరి, సంవత్సరమంతా సరదా వినోదాలలో పాల్గొనండి. మిమ్మల్ని ఉత్సాహిత లూగించే న్యూస్ లెటర్స్ బహుమతులు, ఆటలూ ఇంకా ఎన్నెన్నో !

మీరు చేయాల్సినది ఈ [MAGGI] ను 5 ఖాళీ మేగీ నూడుల్స్ పేకెల నుండి కత్తిరించి, మీ పేరు, చిరునామా, మీకు నచ్చిన బహుమతిని పేర్కొని మాకు పంపండి. మీరు గనుక మెంబరయితే మీ నంబరును వ్రాయటం మరువకండి. మీరింకా మేగీ క్లబ్ మెంబరుకాని పక్షంలో, మెంబరుకావటానికిదే మంచి అవకాశం. మీ వివరాలతో బాటు మెంబర్‌షిప్ కావాలని వ్రాయండి. మీ బహుమతితో బాటు, మేగీ క్లబ్ మెంబర్‌షిప్ కార్డు ఉచితంగా పంపబడుతుంది.

మా అడ్రసు:

మేగీ క్లబ్

పి.ఒ. బాక్స్. 5788,
న్యూ ఢిల్లీ-110 055



మేగీ 'జాదూ జంగిల్' మీరు స్వంతంగా నిర్మించండి.




ఆర్చీ కామిక్స్!




మేగీ 'బర్డ్‌హౌస్' ను నిర్మించండి.



ఉచిత మేగీ 'వరల్డ్ ఆఫ్ యానిమల్స్' ప్రశ్నోత్తరావళి

యానిమల్స్' ప్రశ్నోత్తరావళి మీరు 3 బహుమతులు సేకరించగానే, ఆసక్తికరమైన, ఉత్కంఠత కలిగించే అద్భుత యదార్థ విషయాలెన్నో తెలియజేసే ఉచిత మేగీ 'వరల్డ్ ఆఫ్ యానిమల్స్' ప్రశ్నోత్తరావళిని పంపుతాము. గేములలోనున్న వివరాలను శ్రద్ధగా చూడండి.







మరొక ఉపహారం: ఈ సరికి మీరు 'లాస్ ఆఫ్ ద జంగిల్ గేమ్'ను సేకరించి ఉండక పోతే, వెంటనే వాటిని పొందండి.




# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

## మానవత్వపు విలువలకు ప్రథమస్థానం!

ఈ సంవత్సరారంభంలో, అమెరికాలో జరిపిన ఒక సర్వేలో, అక్కడి ప్రజలలో అధిక సంఖ్యాకులు మతపరమైన విశ్వాసాలకు అధిక ప్రాధాన్యత ఇస్తున్నట్టు తెలియవచ్చింది. ఆరోగ్యానికి రెండవ స్థానమూ, విద్యకు మూడవస్థానమూ, సంపదకు నాలగవస్థానమూ ఇస్తున్నట్టు ఆ సర్వే ద్వారా వెల్లడయింది. 1775-83 మధ్య జరిగిన స్వాతంత్ర్య సమరంలో మాతృభూమి అయిన ఇంగ్లండుతో సంబంధాన్ని తెగతెంపులు చేసుకుని, అమెరికాలో స్థిరపడిన ప్రజలు ఆర్థిక ప్రగతే ప్రధాన లక్ష్యంగా భావించి కృషిచేసి, రెండువందల సంవత్సరాలలో జాతీయస్థాయిలోనూ, వ్యక్తిపరంగానూ అద్భుతమైన ప్రగతిని సాధించారు. ఇప్పుడు వాళ్ళ దృష్టి మత విశ్వాసాలవైపు మళ్ళడంలో ఆశ్చర్యం లేదు.

మనకు స్వాతంత్ర్యం వచ్చి నలభైనాలుగేళ్ళు పూర్తయ్యాయి. ఈనాడు మన ప్రజల పరిస్థితి ఎలా ఉన్నది? ఈ విషయం గురించి ప్రస్తావిస్తూ, సుప్రీంకోర్టు మాజీ ప్రధాన న్యాయమూర్తి జస్టిస్ భగవతి బొంబాయిలో—ఇవాళ మనలో చాలా మందికి దేశభక్తి తగ్గిపోతున్నది. తీరని అధికారదాహం, సంపదలపై వ్యామోహం వీటి కారణంగా మానవత్వపు విలువలు నానాటికీ తరిగిపోతున్నాయి—అని తన విచారాన్ని వ్యక్తం చేశారు.

కాబట్టి, పరిస్థితి విషమించక ముందే మనం జాగ్రత్తపడాలి. మన గత వైభవాన్ని, సంస్కృతిని గుర్తు తెచ్చుకుని, సనాతన ఋషులూ, మునులూ ప్రబోధించిన మానవత్వపు విలువలను పాటించినట్టయితే, ప్రస్తుత దుస్థితి తొలగిపోయి దేశ భవిష్యత్తు మూడు పువ్వులూ ఆరు కాయలుగా విరాజిల్లుతుంది!

సంపుటి 89 | ఆగస్టు '91 | సంచిక 2

విడి ప్రతి : 4-00 : : సంవత్సర చందా : 48-00



SUPER CHAMPS

COLLECTION

SCHEME

FREE

స్పోర్ట్స్‌స్టార్ స్టికర్లు









సూపర్ వినోదం !
సూపర్ ఆశ్చర్యాలు !
24 స్టికర్లు సేకరించండి.
బహుమతులు గెలవండి.
ఇవిగో చూడండి !

కొత్త 25 హాజ్మోలా కేండీ "సూపర్‌ఛాంప్స్" ప్యాక్. మీకు చాలా యిష్టమైన స్పోర్ట్స్ స్టార్ స్టికర్లు అందులో ఉంటాయి. ఇమ్రాన్ ఖాన్, ఇవాన్ లెండల్, స్టెఫీగ్రాఫ్. ఇంకా అనేక మంది గొప్ప స్టార్లు మిమ్మల్ని కలుసుకునేందుకు ఆత్రుతతో ఉన్నారు. 5 స్టికర్లు సేకరించండి. అద్భుతమైన "సూపర్‌ఛాంప్స్" ఆల్బమ్ మీ సొంతం అవుతుంది. అంతే కాదు. మీకు ఉత్తేజకరమైన హాజ్మోలా కేండీ క్లబ్‌లో ఉచితంగా సభ్యత్వం లభిస్తుంది.

(ప్రతి "సూపర్‌ఛాంప్స్" ప్యాక్ లోపల వివరాలు లభిస్తాయి.)

త్వరపడండి ! మీ "సూపర్‌ఛాంప్స్" సేకరణ ఈ రోజే ప్రారంభించండి.






Hajmola®
CANDY

SURPRIZE
కానుకలు – ఆల్బమ్ పూర్తి చేసిన మొదటి 1000 మందికి!




everest/d91/DIL/69 tel




# కంబోడియాలో శాంతి

కంబోడియాలో గత పన్నెండేళ్ళుగా సాగిన అంతర్యుద్ధం ఒక విధంగా అంతమయింది. ఐక్యరాజ్యసమితి తీసుకున్న శాంతిచర్యల ఫలితంగా, ఆ సంస్థ అధ్వర్యంలో ఏర్పడనున్న 'సుప్రీం నేషనల్ కౌన్సిల్'లో పాలుపంచుకోవడానికి, పోరాటం సాగిస్తూన్న మూడు తిరుగుబాటుదారుల సంస్థలూ ఒక ఒప్పందానికి రావడంతో శాంతి సాధ్యమయింది!

కంపూచియా అని పిలువబడే కంబోడియాను, రెండవ ప్రపంచయుద్ధకాలంలో, జపాన్ ఆక్రమించుకునేంతవరకు, అది ఫ్రెంచ్ ఇండో-చైనాలో అంతర్భాగంగా వుండేది. 1945 వ సం॥లో జపాన్ ఓడిపోవడంతో, అది మళ్ళీ ఫ్రాన్స్ వశమయింది. కాని, 1953 వ సం॥లో ఫ్రాన్స్ అక్కడి నుంచి వైదొలగడంతో అది స్వతంత్రదేశమయింది.

అయితే, అమెరికా మద్దతు గల లాన్‌నోల్, 1970 వ సం॥లో హఠాత్తుగా ఎదురు తిరగడంతో అంతవరకు సాగిన ప్రిన్స్‌సిహనౌక్ పరిపాలన అంతమయింది. సిహనౌక్ దేశాన్ని వదిలిపెట్టాడు. ఐదేళ్ళ తరవాత, ఖెమర్‌రౌగ్ నాయకత్వంలోని గెరిల్లాలు అధికారాన్ని హస్తగతం చేసుకున్నారు. కాని, అసంఖ్యాకమైన ఆకలి

చావులూ, దారుణమైన హత్యాకాండ కారణంగా వాళ్ళ పాలన కూడా మూడేళ్ళ ముచ్చటే అయింది. పొరుగు దేశమైన వియత్నాం, సేనలను పంపి, 1979 వ సం॥లో హెంగ్ సామ్రిన్ నాయకత్వంలో నూతన ప్రభుత్వం ఏర్పాటు చేసింది. అయితే, కంబోడియా నుంచి, వియత్నాం సేనలు వైదొలగడం ప్రారంభించగానే మళ్ళీ అంతర్యుద్ధం ప్రారంభమై, దాదాపు పన్నెండేళ్ళపాటు, వ్యవసాయ దేశమైన కంబోడియా ఆర్థికస్థితిని దెబ్బ తీసింది.

ఇండొనేషియా రాజధాని జకార్తాలోనూ, థాయ్‌లాండ్‌లోనూ జరిగిన చర్చల ద్వారా, పోరాడుతూన్న మూడు గ్రూపుల మధ్య ఒక ఒప్పందం ఏర్పడింది. ప్రిన్స్ సిహానౌక్‌కూ, ఖేమర్‌రౌగ్‌కూ, ఖేమర్ పీపుల్స్ నేషనల్ లిబరేషన్ ఫ్రంట్‌కూ మద్దతునిచ్చే మూడు సంస్థలూ—సుప్రీమ్ నేషనల్ కౌన్సిల్‌లో చోటు చేసుకుంటాయి. ప్రిన్స్ సిహానౌక్ అధ్యక్షుడుగానూ, ప్రస్తుత ప్రధాన మంత్రి హున్‌సేన్ ఉపాధ్యక్షుడుగానూ వుంటారు.

సిహానౌక్ నవంబర్ నెలలో మాత్రమే స్వదేశానికి తిరిగి రాగలనని ప్రకటించడం వల్ల, సుప్రీం నేషనల్ కౌన్సిల్ సమావేశం ఆగస్టులో థాయ్‌లాండ్ రాజధానీ నగరం బ్యాంకాక్‌లో జరుగుతుంది.

మన దేశానికీ, కంబోడియాకు ప్రాచీన కాలం నుంచీ సన్నిహిత మైత్రీసంబంధాలున్నాయి. ప్రపంచంలోకెల్లా అతి పెద్ద ఆలయ ప్రాంగణం 'అంగ్‌కర్ వాట్' కంబోడియాలోనే ఉన్నది. పన్నెండవ శతాబ్దంలో నిర్మించబడిందని భావించబడే ఈ బ్రహ్మాండమైన ఆలయంలో, భవనాలూ హైందవ ఆలయాలూ, బౌద్ధమందిరాలూ వున్నాయి. అవి ఇప్పుడు శిథిలావస్థలో ఉన్నాయి. అంగ్‌కర్ ఒకప్పుడు ఖేమర్ సామ్రాజ్యానికి రాజధానిగా ఉండేది!





# తెలివిగలవాడు

భూషయ్య అనే భూస్వామికి ఆస్తి వ్యవహారాలు చూసేందుకు మనిషి కావలసి వచ్చిందని తెలిసి, వీరప్ప అనే యువకుడు వెళ్ళాడు.

భూషయ్య వాణ్ణి వచ్చిన పనేమిటో అడిగి తెలుసుకుని, "సరే, నువ్వు నాకంటే తెలివైనవాడివని ఋజువైతే నిన్ను పనిలోకి తీసుకుంటాను. అందుకు నువ్వు మూడు పనులు చేయాలి. శివాలయంవీధిలో వుండే రామన్న నాదగ్గిర రెండువందల వరహాలు అప్పు తీసుకుని, రెండేళ్ళుగా బాకీ తీర్చడం లేదు. వడ్డీ లేకుండా అప్పిచ్చానన్న కృతజ్ఞత కూడా లేని వాడిదగ్గిర్నుంచి, బాకీ వసూలు చేయడం నావల్ల కాకుండా వుంది. నువ్వు ఆ బాకీ వసూలుచేస్తే, తర్వాత మిగిలిన రెండు పనులూ ఏమిటో చెబుతాను," అన్నాడు.

వెంటనే వీరప్ప, "మీరు కాసేపాగి రామన్న ఇంటికి రండి. మీ బాకీ తీరిపోతుంది," అని భూషయ్యకు చెప్పి, రామన్న ఇంటికి వెళ్ళి, "రామన్నా! ఉన్నపళంగా రెండువందల వరహాలు అవసరపడ్డాయి. నెలకు నూటికి పది వరహాలు వడ్డీగా ఇచ్చుకోగలనని పత్రం రాసిస్తాను. నువ్వు నాకు అప్పిచ్చి ఆదుకోవాలి," అన్నాడు.

ఎక్కువ వడ్డీ వస్తుందని ఆశపడి, రామన్న వెంటనే లోపలగదిలోకి వెళ్ళి, రెండువందల వరహాలు ఎంచి తెచ్చి, వీరప్పకు ఇచ్చి, "నువ్వు డబ్బు లెక్కపెట్టుకుంటూండు. నేను పత్రం తయారు చేస్తాను," అన్నాడు.

వీరప్ప డబ్బు లెక్కపెడుతూండగా, అక్కడికి భూషయ్య వచ్చాడు. రామన్న భూషయ్యను చూసి తడబడ్డాడు. వీరప్ప

"వసుంధర"



''దానికేముందిలే, హెచ్చుపడ్డీకి ఇంకెవ రైనా అప్పివ్వక పోరు. మరొకచోట ప్రయత్నిస్తాను,'' అంటూ వీరప్ప అక్కణ్ణించి వెళ్ళిపోయాడు.

తర్వాత భూషయ్య, వీరప్పను మెచ్చుకుని, ''ఈ ఊళ్ళో నాకు రెండిళ్ళు వున్నాయి. ఒకదాంట్లో నేనుంటున్నాను. రెండోదాంట్లో సూరయ్యఅద్దెకుంటున్నాడు. వాడు నెలనెలా అద్దె కడతాడు కానీ, ఇల్లు ఖాళీ చేయమంటే చేయడు. మూడు వారాల్లో నా అల్లుడు, కూతురు వచ్చి ఈ ఊళ్ళో వుండబోతున్నారు. వాళ్ళొచ్చే సరికాయిల్లు సూరయ్యచేత ఖాళీ చేయించాలి,'' అన్నాడు.

వీరప్ప వెళ్ళి, సూరయ్యను కలుసుకుని మాట్లాడాడు. వాడు నిజాయితీపరుడేగానీ మొండివాడని వీరప్ప కర్థమయింది. ఇల్లు ఖాళీ చేయమని భూషయ్య, వాడితో అమర్యాదగా మాట్లాడాడట! అందుకని సూరయ్య ఇప్పట్లో ఇల్లు ఖాళీ చేయనని భీష్మించుకుని కూర్చున్నాడు. ముందుగా పత్రం రాసుకోవడంవల్ల, మరొక రెండు సంవత్సరాలదాకా సూరయ్య ఇల్లు ఖాళీ చేయనక్కర్లేదు.

వీరప్ప, సూరయ్యతో మూడు రోజుల పాటు స్నేహంగా తిరిగాడు. రోజూ వాడి కుటుంబానికి తినడానికి మిఠాయిలిస్తూండే

మాత్రం భూషయ్యవంక చూసి, "అయ్యో! అవసరంలోపడి అసలు సంగతి మర్చిపోయాను. భూషయ్యగారు నన్నిక్కడికి బాకీవసూలుకు పంపారు.'' అంటూ తన వద్ద వున్న డబ్బును భూషయ్య కిచ్చి, ''బాబూ, సరిగ్గా లెక్కపెట్టుకోండి, రెండు వందల వరహాలు!'' అన్నాడు.

భూషయ్య ఆశ్చర్యపోయాడు. రామన్న కంగారుగా, "వీరప్పా! ఆ డబ్బు భూషయ్య గారి బాకీ తీర్చాలని అట్టే పెట్టాను. నువ్వు అవసరంలో వున్నావుకదా అని జాలిపడి, అదే నీకు అప్పుగా ఇవ్వాలనుకున్నాను. ఇప్పుడు నీకివ్వడానికి నా దగ్గిర ఒక్క వరహా కూడా లేదు,'' అన్నాడు.

వాడు. సూరయ్య పిల్లలు వీరప్పను మామా అని పిలవసాగారు.

ఈలోగా వీరప్ప ఊళ్ళోని షావుకారును కలుసుకుని, ''సూరయ్య ఇల్లు మారతాడట. నీ ఇల్లు అద్దెకిస్తావా ?'' అని అడిగాడు.

షావుకారు ఇల్లొకటి చాలా కాలంగా ఖాళీగా వుంటున్నది. ఎవరైనా అద్దెకు వస్తే బాగుండునని, ఆయన ఎదురు చూస్తున్నాడు. వీరప్ప మాటలు విని షావుకారు ఎగిరి గంతేసినంతపని చేశాడు.

''సూరయ్య అదొకరకం మనిషి. లేడికి లేచిందే పరుగు అన్నట్లు, తోచిన వెంటనే పనైపోవాలి. నీ ఇంటి తాళాలు నాకివ్వు.'' అని వీరప్ప, షావుకారునడిగి తాళాలు తీసుకున్నాడు.

కొంతసేపటికి వీరప్ప, సూరయ్య ఇంటికి వెళ్ళి, ''నేనంతా గమనిస్తున్నాను. ఈ ఇల్లు మీకు అచ్చిరాలేదు. ఇంకా ఇక్కడే వుంటే, మీ కుటుంబాన్నే భూతమో ఆవహించి బాధిస్తుంది. నామాట విని, షావుకారిల్లు ఖాళీగా వుంది, అక్కడికి మారిపొండి.'' అని చెప్పాడు.

రోజూ మంచిగా మాట్లాడే వీరప్ప ఇలా అనగానే, సూరయ్య భార్యాబిడ్డలు భయపడ్డారు. కానీ, సూరయ్య మాత్రం నిబ్బరంగా, ''నిన్నా భూషయ్యే పంపివుంటాడు.



ఎట్టిపరిస్థితుల్లోనూ నేనీ ఇల్లు వదలను. భూషయ్య రాసిచ్చిన పత్రం నా దగ్గిరుంది.'' అంటూ ఆ పత్రం తెచ్చి చూపించాడు.

వీరప్ప ఆ పత్రం చదివి, ''ఏమో, నీ మంచికోసం చెప్పాను. విన్నావా నీ ఇష్టం! లేకుంటే నాకేం నష్టం లేదు.'' అంటూ అందరికీ మిఠాయిలు పంచిపెట్టాడు.

ఆ మిఠాయిల్లో ఈసారి వీరప్ప మత్తు మందు కలపడంవల్ల, మొత్తం సూరయ్య కుటుంబమంతా స్పృహలేకుండా పడిపోయారు.

అప్పుడు వీరప్ప, భూషయ్య సాయంతో బండినీ, మనుషుల్నీ ఏర్పాటు చేయించి,



మొత్తం సూరయ్య ఇంటి సామానంతా షాహుకారింటికి తరలించి, అక్కడ శుభ్రంగా సర్దించాడు. తర్వాత సూరయ్య కుటుంబాన్ని అక్కడి మంచాల మీదికి చేర్చి, ఖాళీ ఇంటిని భూషయ్య కప్పగించాడు. ఆయన వెంటనే తన సామాను కొంత అక్కడికి పంపి, తన ఇంట్లో వాళ్ళను కొందరిని అక్కడే వుండమన్నాడు.

ఈలోగా వీరప్ప, సూరయ్యవద్ద వున్న పత్రాన్ని చించేశాడు. సూరయ్యకు స్పృహ వచ్చేసరికి, తను వేరే ఇంట్లో వున్నానని గ్రహించి తెల్లబోయాడు. కానీ వాడిక చేయగలిగిందేమీ లేదు!

భూషయ్య తన ఇల్లు తన పరమైనందుకు, వీరప్ప నెంతగానో మెచ్చుకుని, ''ఇక నువ్వు చేయాల్సిన మూడవపని ఏమిటంటే—నా భార్యను ఒక రోజంతా మౌనవ్రతం పాటించేలా చేయడం! ఇది చాలా కష్టమైనపని. నేను నా భార్యకు నగలు చేయిస్తానన్నాను, పట్టుచీరలు కొంటానన్నాను, పట్నం వింతలు చూపుతానన్నాను. కానీ ఆమె కొద్దిక్షణాలు కూడా మౌనవ్రతం పాటించలేకపోయింది. ఎలా సాధిస్తావేమరి!'' అన్నాడు.

వీరప్ప ఆ సాయంత్రమే భూషయ్య భార్యను కలుసుకుని, ఒక తాయెత్తు యిచ్చి, ''అమ్మా! ఇది కుడిచేతికి కట్టుకుని ఒక రోజంతా మౌనవ్రతం పాటించారంటే, మీ చుట్టుపక్కలవారందరికంటే రెట్టింపు వైభవంగా వుంటారు. ఈ తాయెత్తు మహిమ ఎంత గొప్పదంటే, మీ వైభవం పెరగనిపక్షంలో చుట్టుపక్కలవాళ్ళ వైభవం తగ్గిపోతుంది! ఆ విధంగా ఎల్లప్పుడూ మీ వైభవం చుట్టుపక్కల వాళ్ళకు రెట్టింపు వుండి తీరుతుంది,'' అని చెప్పాడు.

భూషయ్య భార్య ముందు కాసేపు వీరప్పను అనుమానించింది. కానీ కాసేపాలోచించి, ''ఇందులో నాకేమీ నష్టం లేదు. ఒక రోజు మౌనవ్రతం పాటిస్తాను. తాయెత్తులో మహిమ లేకపోతే సరేసరి!

మహిమ వుంటే మాత్రం చుట్టుపక్కల వాళ్ళకంటే వైభవంగా వుండవచ్చు కదా!'' అనుకున్నది.

తన భార్య ఒక రోజంతా మౌనవ్రతం పాటించేసరికి, భూషయ్య వీరప్పను మెచ్చుకుని, ''నువ్వు నాకంటే తెలివైన వాడిననుకుంటున్నావు. కానీ నేను తెలివిగా నీచేత నా పనులు చేయించుకున్నాను. తెలివైనవాడు ముందుగా ప్రయోజనం పొందకుండా, నీ మాదిరిగా ఎవరికీ సాయ పడదు. కాబట్టి నిన్ను, నేను పనిలోకి తీసుకోలేను,'' అన్నాడు.

వీరప్ప తొణకకుండా, ''అయ్యా! తమరు చెప్పింది న్యాయమే కానీ, చెప్పిన కారణం సబబుగా లేదు. తెలివైనవాడు తనకంటే తెలివైనవాడిని, తనవద్ద పనిలో వుంచుకోడు. నేను మీకంటే తెలివైన వాడినని గ్రహించి, మీరు నన్ను పనికి తీసుకోవడం లేదు. ఈ విషయం ఒప్పు కుంటే, నేను తమను పని ఇప్పించమని అడగనే అడగను,'' అన్నాడు.

భూషయ్య వాడు చెప్పిందానికి అంగీ కరించి, ''నువ్వు నాకంటే తెలివైన వాడివి. నీ తెలివితేటలతో నువ్వు స్వతంత్రంగా బతకగలవు. నేను నా పరీ క్షలో ఓడినవాడికే తప్ప నెగ్గినవాడికి పనివ్వకూడదని ముందే నిర్ణయించు కున్నాను,'' అన్నాడు.

అంతలో లోపలినుంచి, ఆయన చిన్న కూతురు అమలవచ్చి, ''నాన్నా! నీకంటే తెలివైనవాడికి నన్నిచ్చి పెళ్ళి చేస్తానన్నావు. అందుకే ఈ వీరప్ప నన్ను పెళ్ళి చేసు కుంటానంటే, నీచేత నీకంటే తెలివైన వాడివి అనిపించుకోవాలన్నాను. వీరప్ప అది సాధించాడు. కాబట్టి నువ్వు మా పెళ్ళి జరిపించాలి,'' అన్నది.

భూషయ్య వీరప్పతో, ''నువ్వు నాకంటే తెలివైనవాడివి, సందేహం లేదు. ఇంత తెలివైన నిన్ను పెళ్ళి చేసుకుంటానని, నా కూతురంటే ఎలా కాదంటాను?''అన్నాడు.

వీరప్ప, అమలను పెళ్ళి చేసుకుని కలకాలం సుఖంగా జీవించాడు.



# చివరి అవకాశం

పూర్వం దేవయ్య అనే మతాధిపతి, దైవభక్తి, అహింస, పరమతసహనం, సర్వమానవ సమానత్వం మొదలైన వాటిని గురించి తీవ్రంగా ప్రచారం చేసేవాడు.

అయితే, అతడికి ప్రత్యర్థిగా వుండే యశపాలుడు మాత్రం, కరుడుకట్టిన ఛాందస భావాలతోపాటు, హింస, నాస్తికత్వం అంటూ ప్రచారం చేస్తూండేవాడు. దీనితో యశపాలుడు దేవయ్యల మధ్య బద్ధ శత్రుత్వం వుండేది.

ఇలా వుండగా, ఒకసారి దేవయ్య తీవ్రమైన వ్యాధిగ్రస్తుడై మృత్యు ముఖంలో వున్నాడు. దాదాపు అపస్మారక దశలో వున్న దేవయ్య, ఎవరినీ చూసే స్థితిలో లేకపోయినా, తన ప్రత్యర్థి యశపాలుడిని మాత్రం గది లోపలికి రమ్మనమన్నాడు.

"ఈ స్థితిలో ఎవరినీ కలుసుకోవడానికి ఇష్టపడని నువ్వు, నాతో మాట్లాడాలని పిలిపించడం ఆశ్చర్యంగా వుందే!" అన్నాడు యశపాలుడు.

అప్పుడు దేవయ్య చిన్నగా నవ్వి, "ఈ లోకం విడిచిన ఎవరినైనా, రేపు నేను స్వర్గంలోనైనా కలుసుకోగలను! ఈ భూలోకంలో తప్ప నిన్ను మళ్ళీ కలిసే అవకాశం లేదుకదా! అందుకే నీకీ అవకాశం యిచ్చాను," అన్నాడు.

—ఎం. డి. సౌజన్య






## 6

[సదానందముని యజ్ఞం నుంచి సృష్టించిన అద్భుతశక్తులు గల విచిత్రవ్యక్తి అపూర్వుడు, ముని ఆదేశానుసారం, పేదలనూ, సాధువులనూ, అమాయకులనూ దుర్మార్గుల నుంచి రక్షించడానికి పూనుకున్నాడు. దీర్ఘవ్యాధిని పోగొట్టే సాకుతో, రాకుమారిని పెళ్ళాడడానికి ఎత్తుగడ వేసిన దుష్ట మాంత్రికుణ్ణి, నీచుడైన వాడి శిష్యుణ్ణి రాజుకు పట్టిచ్చాడు.—తరవాత]

"సమీరా." అన్న పిలుపు విని, మంచం మీద పడుకున్న సమీరుడు, ఉలిక్కిపడి లేచాడు. అపరాత్రి వేళ అపూర్వుణ్ణి చూడగానే, ఆయనకు భక్తితో నమస్కరించాడు.

"నువ్వొక చిన్న సాయం చేయాలి," అన్నాడు అపూర్వుడు.

"మీకోసం ప్రాణాలివ్వమన్నా సంతోషంగా ఇస్తాను," అన్నాడు సమీరుడు.

"నా కోసం కాదు. నలుగురు కుర్రాళ్లు ఆపదలో చిక్కుబడిపోయారు. వాళ్ళను రక్షించాలి!" అన్నాడు అపూర్వుడు.

"మీ ఆజ్ఞను పాటించడానికి సిద్ధంగా ఉన్నాను," అన్నాడు సమీరుడు.

"మాటలకిది సమయం కాదు. నా వెంటరా," అంటూ అపూర్వుడు చేయి పట్టుకుని వెలుపలికి నడిచాడు. సమీరుడు ఆయన్ను ఉత్సాహంగా అనుసరించాడు.



నడకవేగం హెచ్చుతూన్నకొద్దీ, సమీరుడికి గాలిలో తేలిపోతున్నంత తేలికగా అనిపించింది. కొంతసేపటికల్లా ఇరువురూ సముద్రతీరం చేరుకున్నారు. సముద్రంలో నది సంగమిస్తూన్న స్థలానికి కొద్ది దూరంలో ఒక ఓడ లంగరు దించబడి నిలబడి ఉన్నది.

"అయిదుగురు కుర్రాళ్ళు విహార యాత్రకని ఇటుకేసి వచ్చారు. దూరంలో ఓడ కనిపించగానే వాళ్ళకు దానిని సమీపించి చూడాలన్న ఉత్సాహం కలిగింది. దానిని ఆసరాగా తీసుకుని ఓడ యజమాని, వాళ్ళను మంచి మాటలతో ఓడ లోపలికి తీసుకు వెళ్ళాడు. ఓడలోని గదులనూ, వాటిలోని వింత వస్తువులనూ చూపాడు. ఓడ నడిచేవిధానాన్నీ, లంగరు దించే పద్ధతినీ విడమరిచి చెప్పాడు. తీరా, కుర్రాళ్ళు ఇంటికి తిరిగి వెళ్ళాలనుకున్నప్పుడు, ఓడ యజమాని వాళ్ళకు తియ్యటి పానీయం ఇచ్చాడు. దానిని తాగగానే వాళ్ళు స్పృహకోల్పోయి నిద్రమత్తులో పడిపోయారు. ఇక కొంతసేపట్లో ఓడ బయలుదేరుతుంది. ఆ కుర్రాళ్ళను దూర ద్వీపాలకు తీసుకుపోయి, బానిసలుగా విక్రయించాలని ఓడ యజమాని పథకం వేశాడు," అని వివరించాడు అపూర్వుడు.

"ఇవన్నీ మీకెలా తెలిశాయి?" అని అడిగాడు సమీరుడు.

"ఆ కుర్రాళ్ళు చిన్న పడవలో ఓడను సమీపించడం చూశాను. ఓడ యజమాని ఉద్దేశాన్ని శంకించి, రహస్యంగా వాళ్ళను వెంబడించి వెళ్ళాను. చాటు నుంచి వాళ్ళ మాటలను విన్నాను," అన్నాడు అపూర్వుడు.

"మీరా ఓడలోకి ఎలా వెళ్ళారు?" అని అడిగాడు సమీరుడు.

"ఇప్పుడు మనం ఎలా వెళ్ళనున్నామో, అలాగే వెళ్ళాను. అక్కడ నేను చాటు నుంచి ఏం చేయాలో నీకు సూచిస్తాను. నువ్వా కుర్రాళ్ళకు బయటపడే మార్గం చూపాలి!" అన్నాడు అపూర్వుడు.



"మీరేమో చాటుగా వుంటారు. మరి నేను నావికుల కంటబడకుండా కుర్రాళ్ళకెలా దారి చూపగలను? వాళ్ళకు పట్టుబడి పోగలను కదా?" అన్నాడు సమీరుడు అనుమానంగా.

"నీకా అనుమానం వద్దు. నువ్వూ పట్టుబడిన కుర్రాళ్ళలో ఒకడుగా కలిసిపో. కుర్రాళ్ళ సంఖ్య విషయంలో నావికులకు అనుమానం కలగవచ్చు. అయినా, అదీ ఒక తమాషాగానే వుంటుంది. సరే, నువ్విప్పుడు సముద్రయానానికి సిద్ధమే కదా?" అని అడిగాడు అపూర్వుడు.

"సిద్ధమే!" అన్నాడు సమీరుడు.

అపూర్వుడు సముద్రం కేసి చూస్తూ ఈలవేశాడు. మరుక్షణమే ఉవ్వెత్తున లేస్తున్న అలలపై, నీళ్ళను పైకి చిమ్ముతూ నాలుగు గండుమీనులు లేచిపడి ఒడ్డుకు ఉరుకుతూ వచ్చాయి. అపూర్వుడు సమీరుడికి చేయి అందించాడు. ఇరువురూ చెరొక గండుమీనం మీదికి ఎక్కారు. ఆ రెండు గండుమీనులూ శరవేగంతో ఓడకేసి బయలుదేరాయి. వాటికి రక్షణగా రెండు వైపులా మరి రెండు గండుమీనులు ఈదుతూ వెళ్ళాయి.

"ఈ గండుమీనుల్ని ఎలా మచ్చిక చేసుకోగలిగారు?" అని అడిగాడు సమీరుడు.

"నేను వీటిని మచ్చిక చేసుకోలేదు. విశ్వమంతటా దివ్యాత్మ వ్యాపించి ఉన్నది. మానవులలో, జంతువులలో, పక్షులలో, సర్వప్రాణికోటిలోనూ ఈ దివ్య అంశ ఆధారభూతంగా, అతిసూక్ష్మంగా వ్యాపించి ఉన్నది. ఆ అంశను స్పృశించి, సందేశాన్ని పంపామంటే, మన ఉద్దేశం మంచిదయినప్పుడు, ఆ ప్రాణి మన సందేశానుసారం నడుచుకుంటుంది. నేనా సూక్ష్మ అంశం ద్వారానే, ఈ గండుమీనులను ఆదేశించాను," అని వివరించాడు అపూర్వుడు.

"అలాగా! మరయితే, మానవహృదయాలలోనూ మీరా సహకారభావాన్ని



కలిగించగలరన్నమాట!'' అన్నాడు సమీరుడు.

''మనుషులందరిలోనూ అలాంటి సహకార భావాన్ని కలిగించలేము. ఎందుకంటే మనిషి మిగతా జంతుజాలం లాగా కేవలం ప్రకృతికి అధీనమైనవాడు కాడు. మానవజీవితంలో మనసు ప్రధానమైన పాత్ర వహిస్తున్నది. మనసులో అనుక్షణం ఎన్నో అనుమానాలూ, ఆలోచనలూ, ప్రశ్నలూ సముద్ర తరంగాల్లాగా వస్తూవుంటాయి. అయినప్పటికీ, సత్యసంధులూ, మాయమర్మాలెరుగని స్వచ్ఛమైన మనసు కలిగినవారూ నా పిలుపును వినగలరు!'' అన్నాడు అపూర్వుడు.

ఇంతలో వాళ్ళు ఓడను సమీపించారు. చుట్టూ చీకటి. గండుమీనులకు కృతజ్ఞతలు చెప్పి, ఇద్దరూ ఓడలోకి ఎక్కారు. కిటికీ నుంచి లోపలికి తొంగిచూశారు. ఆ గదిలో కుర్రాళ్ళు హాయిగా నిద్రపోతున్నారు. ఇంకా వాళ్ళకు పానీయం మత్తు వదలలేదు. ఆ గది తలుపులు మూసి, తాళం వేసి ఉన్నది.

నిశ్శబ్దంగా, ఇద్దరూ పక్క గదిలోకి తొంగి చూశారు. అక్కడ ఓడ యజమాని, కూర్చుని తన సహచరులతో చర్చలు జరుపుతున్నాడు. ఆ గది నిండా, కత్తులూ, ఈటెలూ, కర్రలూ మరికొన్ని వింత ఆయుధాలూ ఉన్నాయి. వాళ్ళ మాటలను బట్టి, ఆ ఓడ సముద్రపు దొంగలముఠాకు చెందినదనీ, ఓడయజమాని దొంగలముఠా నాయకుడనీ, అపూర్వుడు గ్రహించాడు.

''ఆ పిల్లల తల్లిదండ్రులు వాళ్ళను వెతుక్కుంటూ వచ్చేలోగా, మనం ఇక్కడి నుంచి వెళ్ళిపోవాలి,'' అన్నాడు ముఠా నాయకుడు.

''వాళ్ళు వస్తే మాత్రం ఏం చేయగలరు? మన అనుమతి లేకుండా ఓడను సమీపించ లేరు గదా?'' అన్నాడు ఉపనాయకుడు.

''మనల్ని గురించి ఎవరికీ అనుమానం రాకూడదు. అందుకు మనం ఏమాత్రం

అవకాశం ఇవ్వకూడదు,'' అన్నాడు నాయకుడు కోపంగా.

వాళ్ళిద్దరూ ఆ గది నుంచి బయటకు వచ్చారు. అపూర్వుడూ, సమీరుడూ వాళ్ళ కంట బడకుండా చీకటిలో దాక్కున్నారు. నాయకుడు ఆజ్ఞాపించగానే అనుచరులు లంగరెత్తారు. ఓడ కదిలింది. నాయకుడు వెళ్ళి, పిల్లలున్న గది తలుపులు తెరిచాడు.

''సముద్రంలో దూకి తిమింగిలాలకు ఆహారమై పోవాలనుకుంటే తప్ప, ఈ కుర్రాళ్ళు మన నుంచి తప్పించుకోలేరు!'' అన్నాడు ఉపనాయకుడు ఉత్సాహంగా.

ఇద్దరూ తలుపు దగ్గరి నుంచి, మరొక వైపుకు కదిలారు.

''ఆఁ, ఇదే మంచి సమయం. నువ్వు వెళ్ళి, కుర్రవాళ్ళ మధ్య పడుకో,'' అన్నాడు అపూర్వుడు సమీరుడి చెవిలో.

సమీరుడు మెల్లగా వెళ్ళి కుర్రవాళ్ళ మధ్య పడుకున్నాడు.

''వీళ్ళను రత్నద్వీపానికే కదా తీసుకు వెళుతున్నాము?'' అని అడిగాడు ఉప నాయకుడు.

''కాదు. మరొక చిన్న ద్వీపానికి చేర్చాలి. అక్కడికి నాలుగయిదు ప్రాంతాల నుంచి బానిస వ్యాపారులు వస్తారు. ఆ ద్వీపంలో మనం అడిగిన ధర పలుకుతుంది!'' అన్నాడు నాయకుడు.



గది నుంచి ఏదో శబ్దం వినిపించింది. ఉపనాయకుడు తొంగి చూశాడు. దీపం మరీ గుడ్డిగా వెలుగుతున్నది. వాడు లోపలికి వెళ్ళి వత్తిని ఎగదోశాడు.

''ఒక్క కుర్రవాడు వంద దీనారాలు పలుకుతాడు. ఐదుగురు, ఐదువందల దీనారాలు!'' అన్నాడు నాయకుడు ఉత్సాహంగా మీసాలు దువ్వుతూ.

''లెక్కలు వేయడంలో నువ్వు మరీ అంత అధ్వాన్నమని నాకు తెలియదు. వందను ఆరుతో పెంచితే ఐదువందలెలా వస్తాయి?'' అన్నాడు ఉపనాయకుడు.

''మూర్ఖుడా, కుర్రాళ్ళు అయిదుగురే; ఆరుగురు కాదు,'' అన్నాడు నాయకుడు.



''కాదు, ఆరుగురు!'' అన్నాడు ఉప నాయకుడు.

''నువ్వు గాలిలోంచి ఒకణ్ణి కొత్తగా సృష్టించావా ఏమిటి?'' అని కోపంగా అడిగాడు నాయకుడు.

''వచ్చి నువ్వే లెక్కించి, చూడు!'' అని రెట్టించాడు ఉపనాయకుడు.

నాయకుడు లోపలికి వెళ్ళి, పిల్లలను లెక్కించాడు. నిజంగానే ఆరుగురున్నారు. నమ్మలేక దీపాన్ని చేతిలోకి తీసుకుని వెళ్ళి, పిల్లల ముఖాలను పరిశీలించి చూశాడు. మరొకసారి లెక్కించాడు.

''మరీ విచారించకు. ఎక్కువమంది వుంటే మనకే లాభం. ఐదువందల దీనారాలకన్నా, ఆరువందల దీనారాలు లాభసాటి కదా! ఇప్పుడు తెలిసింది కదా ఎవడు మూర్ఖుడో? నన్ను మూర్ఖుడివి అన్నందుకు క్షమాపణ చెప్పాలి!'' అన్నాడు ఉపనాయకుడు గట్టిగా నవ్వుతూ.

''నన్ను మూర్ఖుడనడానికి నీకెన్ని గుండెలు?'' అంటూ నాయకుడు నడుముకు వేలాడుతూన్న కత్తి దూశాడు.

''నేను అనలేదు. నువ్వన్నమాటను నీకే అప్పగిస్తున్నాను!'' అన్నాడు ఉపనాయకుడు.

''ఒక్కసారి కాదు. వందసార్లంటాను! నువ్వు మూర్ఖుడివి! మూర్ఖుడివి!'' అని అరిచాడు నాయకుడు.

వాళ్ళ అరుపులు విని, ఓడలోని అనుచరులందరూ బిలబిలమంటూ అక్కడికి చేరారు. నాయకుడికీ, ఉపనాయకుడికీ మధ్య ద్వేషం, పగ ఉన్నాయని తెలుసు గాని, ఇంత దారుణంగా బయటపడగలరని ఎవరూ ఊహించలేదు.

''నీ మొండి కత్తిని చూసి హడలిపోవడానికి నేనేం అమాయకుణ్ణి కాను! నీ బెదిరింపులు నా దగ్గర సాగవు. జాగ్రత్త!'' అని హెచ్చరించాడు ఉపనాయకుడు.

''ఏమిటీ! ఇది మొండికత్తా? దాని పదును చవిచూపిస్తాను, చూడు!'' అని అరుస్తూ నాయకుడు ముందుకు ఉరికాడు.

ఉపనాయకుడు ఒక్క అడుగు వెనక్కు వేసి, మెరుపువేగంతో పక్కనున్న కత్తిని అందుకుని, నాయకుడి రొమ్ములోకి దించాడు. నాయకుడు కీచుమని అరుస్తూ కిందికి ఒరిగిపోయాడు.

అనుచరులందరూ, భయంతో, మౌనంగా శిలల్లా నిలబడిపోయారు!

ఉపనాయకుడు బిగ్గరగా నవ్వుతూ, ''ఈ దుర్మార్గుడికి తగిన శిక్షే పడింది. ఈ నీచుడు, మన పాతనాయకుణ్ణి ఎలా వంచనతో చంపాడో మీరు మరిచిపోలేదు కదా? నేను వీణ్ణి మోసంతో చంపలేదు. ప్రాణరక్షణకే కత్తిని ఉపయోగించాను. పైగా, ఐదుకూ, ఆరుకూ తేడా తెలియని మూర్ఖుడు మనకు నాయకుడుగా ఉండడానికి తగడు. ఆ దుర్మార్గుడి శవాన్ని సముద్రంలోకి విసిరి మీమీ పనులకు వెళ్ళండి!'' అని ఆజ్ఞాపించాడు.

వాడి ఆజ్ఞానుసారం కొందరు అనుచరులు నాయకుడి మృతదేహాన్ని, సముద్రంలోకి నెట్టారు.

ఓడలోని కేకలు విని, గదిలోని కుర్రవాళ్ళు మేలుకొని లేచి కిటికీగుండా వెలుపలికి చూడబోయారు. వెంటనే సమీరుడు దీపం ఆర్పి, వాళ్ళతో మెల్లగా ఇలా అన్నాడు: ''సముద్రపు దొంగలు మిమ్మల్ని తరలించుకుని వెళ్ళి, దూరద్వీపంలో బానిసలుగా అమ్మడానికి పథకం వేశారు. నా మాట విన్నారంటే ఈ గండం నుంచి బయటపడే ఉపాయం చెబుతాను. ఇప్పుడు నిద్రపోతూన్నట్టు అలాగే పడుకుని కళ్ళు మూసుకోండి. దొంగల పథకంగాని, ఇంతవరకు జరిగిన గొడవలో దొంగల నాయకుడు చచ్చిన విషయంగాని మనకు ఏమాత్రం తెలియనట్టుగానే నడుచుకోవాలి. దొంగల ఉద్దేశాన్ని మనం పసిగట్టినట్టు వాళ్ళు గ్రహిస్తే మనల్ని బంధించవచ్చు. అది మరీ అపాయం!''

ఆ మాటలు విని కుర్రాళ్ళు భయాశ్చర్యాలతో, ఏమీ మాట్లాడలేకపోయారు. సమీరుడు చెప్పినట్టు అలాగే పడుకుని కళ్ళుమూసుకున్నారు. —(ఇంకా వుంది)






# అగ్నిసిద్ధుడి కథ

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, భీతికొలిపే విషసర్పాల బుసలతో, నక్కల ఊళలతో, గుడ్లగూబల అరుపులతో, అతి భయానకంగా వున్న శ్మశానంలో, ఈ అర్ధరాత్రివేళ తిరుగుతున్నావంటే, అందుకు అతి ముఖ్యమైన కారణమేదో వుండి వుండాలి. అయితే, తీరా కార్యం సిద్ధించాక, అగ్నిసిద్ధు డనే రాజులాగా, మొత్తం ఫలితాన్ని అయోగ్యులూ, హాని తలపెట్టిన వాళ్ళపాలు కాకుండా కాపాడుకోగలవో లేదో అన్న అనుమానం కలుగుతున్నది. ఏది ఏమైనా, నీకు ముందు హెచ్చరికగా వుండేందుకు, ఆ అగ్నిసిద్ధుడి కథ చెబుతాను, శ్రమ

## బేతాళ కథలు



తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

అగ్నిధరరాజ్య పాలకుడైన అగ్నిసిద్ధుడు గొప్ప వీరుడైనప్పటికీ, ఏమాత్రం రాజ్యకాంక్ష లేనివాడు. అతడి పరిపాలనలో అగ్నిధరరాజ్యం, అన్ని విధాలా అభివృద్ధి చెందింది. అయితే, ఆ రాజ్యానికీ పొరుగున వున్న విదేహ రాజ్యానికీ తరతరాలుగా శత్రుత్వమున్నది. ఆ కారణంవల్ల, అగ్నిసిద్ధుడు రాజ్యం రాబడిలో ఎక్కువభాగం సైన్యానికి కేటాయించవలసి వస్తున్నది.

ఒకసారి అగ్నిసిద్ధుడు బాగా ఆలోచించి, విదేహరాజైన సోమశేఖరుడికి—తాత, ముత్తాతలనాటి పాతపగలు మరిచి స్నేహంగా మెలుగుదామని, శాంతి రాయబారం పంపాడు.

అయితే, సోమశేఖరుడు మూర్ఖంగా అగ్నిసిద్ధుడితో స్నేహానికి సమ్మతించక, "మా వంశానికి, మీ తాత ముత్తాతలు చేసిన హాని మరవలేను. మన శత్రుత్వం సమసిపోదు!'' అని కబురు పంపాడు.

కొన్ని సంవత్సరాలు గడిచాయి. ఒకనాడు సోమశేఖరుడు వేటకుపోయి, అక్కడ జరిగిన ప్రమాదంలో మరణించాడు. అతడి కుమారుడైన సత్యదీపుడు రాజయ్యాడు. అతడు శాంతస్వభావుడు. గతంలో, తన తండ్రితో స్నేహానికి అగ్నిసిద్ధుడుచేసిన ప్రయత్నం, అతడికితెలుసు. తమ రెండు రాజ్యాల మధ్య శత్రుత్వం చల్లారి, మైత్రి నెలకొనడం ఎలా అని ఆలోచించసాగాడు. ఆ సమయంలో అతడికి అగ్నిసిద్ధుడి కుమార్తె అయిన స్వయంప్రభను గురించి తెలియవచ్చింది.

స్వయంప్రభ గొప్ప సౌందర్యవతేగాక, విద్యాబుద్ధులు నేర్చిన యువతి. ఆమెను వివాహమాడి అగ్నిధర, విదేహరాజ్యాల మధ్య శత్రుత్వం రూపుమాపాలని, సత్యదీపుడు నిశ్చయించాడు.

తన అభిప్రాయం తెలియబరుస్తూ, సత్యదీపుడు రాయబారి ద్వారా అగ్ని



సిద్ధుడికి లేఖ పంపాడు. ఇందుకు అగ్ని సిద్ధుడు చాలా సంతోషించాడు. పగ తీర్చుకోవాలనే తండ్రి బాటలో కాక, ఇరుగుపొరుగు రాజ్యాల మధ్య శాంతిని కోరే సత్యదీపుడు, అగ్నిసిద్ధుడికి చాలా యోగ్యుడుగా కనిపించాడు. అతడికి తన కుమార్తె నిచ్చి వివాహం జరపాలన్న నిర్ణయానికి వచ్చాడు.

అయితే, అగ్నిసిద్ధుడి కుమారుడైన సింహకేసరికి తండ్రి నిర్ణయం నచ్చలేదు. శత్రువుతో వియ్యమందడం అతడికి అవమానంగా తోచింది. కాని, తన ఈ అభిప్రాయాన్ని తండ్రికి మాత్రం చెప్ప లేదు.

యువరాజుతో సఖ్యంగా వుంటూ, అతడికి సలహాలిచ్చే రాజపరివారంలోని ముఖ్యులు కొందరు సంగతి గ్రహించి, సింహకేసరి మనసులో విషబీజాలు నాటారు. స్వయంప్రభను వివాహమాడతా ననడంలో, సత్యదీపుడి కేదో దురాలోచన వున్నదనీ, దానికి సమ్మతించిన మహా రాజుకు మతిచలించిందనీ, ఇప్పుడు చూస్తూ వూరుకుంటే అగ్నిధర రాజ్య సింహాసనం సింహకేసరికి దక్కదనీ నూరి పోశారు.

సింహకేసరి, తండ్రిని తొలగించి సింహాసనం ఆక్రమించుకోవడానికి పథకం వేశాడు. దాని ప్రకారం, ఒకనాటి అర్ధ రాత్రి సమయంలో రాజు అగ్నిసిద్ధుడు ఖైదు చేయబడ్డాడు. ఒక శుభ ముహూర్తాన సింహకేసరి రాజయ్యాడు.

చెరసాలపాలయిన అగ్నిసిద్ధుడు జరిగిన దానికి ఖిన్నుడయ్యాడు. తనను ఖైదు చేయడం సింహకేసరికి పుట్టిన బుద్ధి కాదనీ, రాజోద్యోగుల కుట్రకు లొంగి పోయాడనీ గ్రహించాడు.

సింహకేసరి రాజవుతూనే, సత్యదీపుడికి ఒక దూత ద్వారా ఇలా వర్తమానం పంపాడు : "నా చెల్లెలిని వివాహం ఆడి, మమ్మల్ని వెన్నుపోటు పొడవాలని నువ్వు ప్రయత్నించావు. తాత, ముత్తాతలనాటి

శత్రుత్వాన్ని సాధించడానికి, వివాహం అడ్డం పెట్టుకున్న నిన్ను శిక్షించ కుండా వదలను, వెంటనే యుద్ధానికి సిద్ధంకా!''

ఈ జరిగినదానికి సత్యదీపుడు ఎంత గానో విచారించాడు. యుద్ధంలో సింహ కేసరిని ఓడించి, తిరిగి అగ్నిసిద్ధుణ్ణి రాజుగా చేయాలని అతడు నిశ్చయించు కున్నాడు.

ఇంతలో అగ్నిధరరాజ్య ప్రజల్లో పెద్ద అలజడి బయలుదేరింది. మహారాజును బంధించి, యువరాజు రాజయినందుకు తిరుగుబాటు ప్రారంభమయింది. దానికి రవిచంద్రుడనే యువకుడు నాయకత్వం వహించాడు.

ఇంట గెలిచి, రచ్చగెలవాలన్న ఉద్దేశ్యంతో, సింహకేసరి ముందుగా రాజ్యంలో చెలరేగిన తిరుగుబాటును అణచివేసి, తర్వాత సత్యదీపుడితో యుద్ధానికి తలపడాలని భావించాడు. ఇందుకుగాను రవిచంద్రుణ్ణి బంధించ డానికి తీవ్రప్రయత్నాలు చేయసాగాడు.

ఈ తిరుగుబాటు గురించి విన్న సత్య దీపుడు, యుద్ధానికి అదే అదనుగా భావించి, సైన్యంతో బయలుదేరాడు. సింహకేసరి పరిస్థితి అడకత్తెరలో పోక చెక్క మాదిరయింది. అతణ్ణి రెచ్చగొట్టి సింహాసనం ఎక్కించిన రాజోద్యోగులు, యుద్ధంలో సింహకేసరి ఓడితే, సత్యదీపు డితో సంధి ఒడంబడిక చేసుకుని, తమలో



ఒకరు రాజు కావాలని కుట్ర సాగించారు. ఇది తెలుసుకున్న సింహకేసరికి తనెంత పొరబాటుచేశాడో అర్థమైంది. అతడు కుట్రదారులందర్నీ బంధించి కారాగారంలో వేయించాడు.

విజయమో, వీరస్వర్గమో తప్ప మరొక మార్గం లేదని తెలుసుకున్న సింహకేసరి, సైన్యంలో బయలుదేరి, సత్యదీపుడితో తలపడ్డాడు. రెండు సైన్యాల మధ్య భయంకరమైన పోరు జరిగింది. అయితే, ఖైదు చేయబడిన తమ రాజుపట్ల అభిమానం గల చాలామంది సైనికులు, తమకు తాముగా సత్యదీపుడికి లొంగిపోయారు. దానితో సింహకేసరి, సత్యదీపుడి చేతిలో చిత్తుగా ఓడిపోయాడు.

సత్యదీపుడు, సింహకేసరిని బంధించి, కారాగారం నుంచి రాజు అగ్నిసిద్ధుణ్ణి విడుదల చేయించాడు.

అగ్నిసిద్ధుడు, సత్యదీపుణ్ణి కౌగలించుకుని, "సత్యదీపా! నీకెలా కృతజ్ఞలు చెప్పాలో తెలియడం లేదు. నీ సహాయం మరవరానిది," అన్నాడు.

అందుకు సత్యదీపుడు, "ఇందులో కృతజ్ఞత చెప్పడానికేముంది, మహారాజా! తమరు లోగడ నిర్ణయించినట్టు, నన్ను తమ అల్లుడుగా స్వీకరించండి," అని కోరాడు.

అగ్నిసిద్ధుడు తన మందిరానికి వెళ్ళి, స్వయంప్రభకు కబురు పంపి, ఆమె రాగానే సత్యదీపుడితో ఆమె వివాహం గురించి ప్రస్తావించాడు.





చెప్పి, తర్వాత సత్యదీపుణ్ణి కలుసుకుని, ఈ విషయం వివరించాడు.

అయితే, సత్యదీపుడు, స్వయంప్రభ అనుకున్నట్లు అగ్రహించక, స్వయంగా దగ్గిర వుండి, రవిచంద్రుడితో ఆమె వివాహం జరిపించి, తన రాజ్యానికి వెళ్ళి పోయాడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే, అగ్ని సిద్ధుడు రాజ్యాన్ని తన కుమారుడైన సింహకేసరికి కట్టబెట్టి, వానప్రస్థాశ్రమం స్వీకరించి అరణ్యానికి వెళ్ళి, ఆశ్రమం ఏర్పరుచుకున్నాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, సత్యదీపుడు యుద్ధంలో జయించి కూడా, అగ్నిధర రాజ్యాన్ని ఆక్రమించుకోక పోవడం అటుంచి, కోరిన రాజకుమారి స్వయంప్రభను కూడా వివాహం ఆడకుండా ఎందుకు తిరిగి వెళ్ళాడు. ఇది అతడిలోని రాజనీతి లోపం కాదా? ఇక అగ్నిసిద్ధుడు, ప్రజలను రెచ్చగొట్టి తిరుగుబాటు చేయించడం తప్ప, మరేయోగ్యతా లేని రవిచంద్రుడితో, తన కుమార్తె వివాహం జరిపించడం, అతడి రాజసానికి మచ్చకాదా? మరొక సంగతి: తండ్రి అన్న పూజ్యభావం లేకుండా, తనకు హాని చేసిన సింహకేసరికి సింహాసనం అప్ప గించడం, ఏమన్న రాజనీతిజ్ఞత అనిపించు

స్వయంప్రభ కొద్దిసేపు మౌనంగా వుండి, తర్వాత తండ్రితో, "నాన్నా, నా మనసులోని మాట చెబుతున్నాను. మీరు ఖైదు చేయబడినప్పుడు, ప్రజలలో మీపట్ల రాజభక్తిని రేకెత్తించి, తిరుగుబాటులో ప్రాణాలకు సైతం తెగించి నిలబడిన రవిచంద్రుణ్ణి వివాహమాడాలనుకుంటు న్నాను. కాని, ఈ సంగతి తెలిస్తే సత్య దీపుడు, మీకు హాని చేయగలడని భయంగా వున్నది," అన్నది.

అగ్నిసిద్ధుడు ఒకటి, రెండు క్షణాలు ఆలోచించి, "అమ్మా, నీకలాంటి భయం అక్కరలేదు. నీ వివాహం, నువ్వు కోరి నట్టు రవిచంద్రుడితో జరిపిస్తాను," అని

కుంటుంది? ఈ సందేహాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''అగ్ని సిద్ధుడూ, సత్యదీపుడూ—ఇద్దరూ గొప్ప రాజనీతిజ్ఞులనడంలో సందేహం ఏమీ లేదు. ఎలా అంటే—విదేహ, అగ్నిధర రాజ్యాలమధ్య పాతపగలు మాన్పి, స్నేహ సంబంధాలు ఏర్పరచడం అనేదే, సత్య దీపుడి ప్రధాన లక్ష్యం. రాజకుమారి స్వయంప్రభను వివాహమాడడం అనేది, ఈ లక్ష్యసాధనలో ఒక భాగం మాత్రమే. సింహకేసరి ఓటమి వల్లా, రాజు అగ్ని సిద్ధుడి ప్రవర్తన ద్వారా, ఆ లక్ష్యాన్ని అతడు సాధించాడు. అటువంటప్పుడు, మరెవరినో ప్రేమించిన రాకుమారిని తాను ఆశించటం, ఆటవిక లక్షణం అవుతుంది. అందువల్లనే, అతడు ఆమె వివాహాన్ని స్వయంగా దగ్గిర వుండి జరిపించి, తన దారిన వెళ్ళిపోయాడు. ఇదే నిజమైన రాజ నీతి. ఇక, అగ్నిసిద్ధుడు, రవిచంద్రుణ్ణి తన అల్లుడుగా చేసుకోవడం గురించి. ఎటువంటి సామాన్యుడైనా, తన సొంత బలదర్పాలతో నాయకుడు కాగలిగి నప్పుడు, అతడు అందరిచేతా గొప్ప యోగ్యుడుగానే పరిగణింపబడతాడు. ఆ సంగతి తెలిసినవాడే గనక, అగ్ని సిద్ధుడు రవిచంద్రుణ్ణి తన అల్లుడుగా చేసుకున్నాడు. ఇందువల్ల, అతడి రాజ సౌనికి మచ్చ అంటూ వుండదు. సింహ కేసరి స్వతహాగా మంచివాడు. రాజోద్యో గుల కుట్ర గ్రహించలేక, అతడు తండ్రికి ద్రోహం తలపెట్టాడు. అందుకుగాను అతడు, అటు ప్రజలనుంచీ, ఇటు సత్య దీపుడివల్లా తగిన శిక్ష అనుభవించాడు: ఈ అనుభవంతో అతడు ప్రజాక్షేమం కోరే రాజు కాగలడని విశ్వసించే, అగ్నిసిద్ధుడు అతడికి పట్టం కట్టాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)

[ఆధారం : ఎన్. శివనాగేశ్వరరావు రచన]



# మతిమరుపు

సీతారామయ్యకు పుట్టెడు మతిమరుపు. ఈ క్షణంలో ఏ పని చేసిందీ, మరుక్షణంలో గుర్తుండేది కాదు. ఎక్కడపెట్టిన వస్తువులు అక్కడే మరిచిపోయేవాడు. ఇందువల్ల, అతడి కుటుంబ సభ్యులు నానా ఇబ్బందులు పడేవాళ్ళు. అతడి భార్య వెంటవుండి అన్ని పనులూ చేయించేది.

ప్రతిరోజూ గుడికి వెళ్ళి, అక్కడ రామాయణ పారాయణం వినివచ్చే సీతారామయ్య, రోజూ తన చెప్పులో లేక ఉత్తరీయమో, గొడుగో అక్కడ మరిచి వచ్చేవాడు. తర్వాత ఇంట్లో వాళ్ళలో ఎవరో ఒకరు వెళ్ళి తీసుకువచ్చేవారు.

భర్త మతిమరుపుతో బాగా విసిగిపోయిన సీతారామయ్య భార్య, ఒకరోజు కోపంకొద్దీ అతణ్ణి గట్టిగా చివాట్లు పెట్టింది.

భార్య పెట్టిన చివాట్లు సీతారామయ్యకు చాలా బాధకలిగించినై. ఆరోజు సాయంకాలం అతడు గుడినుంచి ఇంటికి తిరిగివచ్చి, భార్యను కేకవేసి పిలిచి, "నన్ను మతిమరుపువాడి వంటూ తెగ చివాట్లు పెట్టావుగదా! ఈరోజు చూడు, గుడిలో మరిచిపోకుండా చెప్పులు తొడుక్కువచ్చాను," అన్నాడు.

సీతారామయ్య భార్య, అతడి కాళ్ళవంక ఆశ్చర్యంగా చూసి, "మీ మతిమరుపు మందినట్టే వుంది. ఈరోజు మీరు అసలు గుడికి చెప్పులు తొడుక్కుని వెళ్ళలేదు!" అన్నది.

—దాసరి వెంకటరమణ



## చందమామ అనుబంధం-34

## మహనీయులు కలలుగన్న భారతదేశం:

# "దేశమంటే మట్టికాదు!"

**1872** వ సం॥ ఆగస్టు 15 వ తేదీన జన్మించిన శ్రీ అరవిందుడు, ఇంగ్లాండులో ఉన్నత విద్యనభ్యసించి 1893 వ సం॥ మాతృదేశానికి తిరిగివచ్చాడు. అనాటి నుంచి పునరుజ్జీవ భారతదేశ కంఠాన్ని వినిపించాడు. భారతదేశానికి సంపూర్ణ స్వరాజ్యం కోరిన మొట్టమొదటి జాతీయ నాయకు డాయన. దేశానికి స్వాతంత్ర్యం తప్పక వచ్చితీరుతుందని గ్రహించాక, ఆయన 1910వ సం॥లో పాండిచ్చేరికి వెళ్ళాడు. పరిణామక్రమంలో, మానవజాతిని ఉన్నత దశకు తీసుకువెళ్ళడానికి సహాయకారిగా, దివ్యశక్తిని భువికి తీసుకురావడానికి అక్కడ యోగసాధనలో నిమగ్నుడయ్యాడు. (1947 వ సం॥లో అరవిందుడి జన్మదినంనాడు మన దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది.)

ఆయన ఇలా ఉద్ఘాటించాడు: "భారతమాత కేవలం భూగోళంలో ఒక భాగం మాత్రమే కాదు. ఆమె ఒక శక్తి....దివ్యశక్తి. భారతదేశం నశించదు. మానవ జాతి భవిష్యత్తును తీర్చిదిద్దే మహత్తర శక్తి మనదేశానికి ఉన్నది. మానవులందరినీ సంఘటితపరచే—అన్ని మతాల, విజ్ఞాన విషయాల, తాత్విక దర్శనాల సమ్మిళితమైన భావి విశ్వమతాదర్శం భారతదేశం నుంచే వికసిస్తుంది!" ఆ మహాపురుషుడి మహోన్నత భావాలను మన ఆదర్శంగా గుర్తుంచుకుందాం.

## మీకు తెలుసా?

1. ఉత్తర భారతదేశంలో 'దేవతలలోయ' అని పేరుగాంచిన స్థలం ఏది?
2. ఈనాటి ఢిల్లీ నగరం ఉన్నస్థలంలో పాండవులనాటి ఇంద్రప్రస్థం ఉండేదని చెబుతారు. ఈ మధ్య కాలంలో అది ఏడుసార్లు విభిన్న నామాలలో రాజధానిగా వెలిసింది. ఆ పేర్లేమిటో మీకు తెలుసా?
3. ఒక మహనీయుడి అస్థికలను గత 300 సంవత్సరాలుగా ఒక వెండి-అద్దం పెట్టెలో భద్రపరచి, పన్నెండేళ్ళ కొకసారి భక్తులు చూడడానికి అనుమతిస్తున్నారు. ఆ మహనీయుడెవరు? అది ఎక్కడ ఉన్నది?
4. భారతదేశంలో 'అరుణవర్ణ నగరం' అని ప్రసిద్ధిగాంచిన నగరం ఏది? దానికాపేరు ఎందుకు వచ్చింది?

(36 వ పేజీ చూడండి)

## మన దేవుళ్ళు:

# శ్రీ కృష్ణుడు

మహావిష్ణువు అవతారాలలో, సంపూర్ణావతారంగా ప్రసిద్ధమైనది శ్రీ కృష్ణావతారం. దేవకీ వసుదేవుల తనయుడుగా జన్మించిన క్షణంనుంచే, కృష్ణుడు అద్భుతమైన లీలలను చూపాడు. బాల్యంలో గోపబాలురతో కలిసిమెలిసి తిరిగాడు. వంచకురాలయిన పూతనను వధించి, కాళీయమర్దనం గావించి, గోవర్ధనగిరినెత్తి, లోకకంటకుడైన కంసుణ్ణి వధించి గోపగోపీజనులకు ఆనందాశ్చర్యాలు కలిగించి, వారి అవ్యాజప్రేమకు పాత్రుడయ్యాడు. ద్వారకాధిపతిగా, ప్రజలకు ఏ కొరతా లేకుండా పాలించాడు. ధర్మబద్ధులై, ఉన్నతమైన విలువలు పాటించిన పాండవులకు అండగా నిలిచి, వాళ్లను విజయపథంలో నడిపించాడు. భారత యుద్ధ ఆరంభంలో విషాదగ్రస్తుడైన అర్జునుడికి గీతోపదేశం చేసి, కర్తవ్యాన్ని గుర్తుచేసి కార్యోన్ముఖుణ్ణి చేశాడు. భగవద్గీత తరతరాలుగా దారిచూపే ఆధ్యాత్మిక జ్యోతిగా వెలుగొందుతున్నది!

బాలకృష్ణుడి లీలావినోదాలను కీర్తిస్తూ, ఆ జగన్నాటక సూత్రధారి ఆర్తత్రాణపరాయణత్వాన్ని అభివర్ణిస్తూ, ఎందరో భక్తకవులు మధురమైన గీతాలు, అద్భుతమైన కావ్యాలు రచించారు.

శ్రీ కృష్ణజయంతి ఉత్సవాలను దేశమంతటా ఉత్సాహంగా జరుపుకుంటారు.



# చందమామ కబుర్లు





## పికాసో ఘనత!

సుప్రసిద్ధ చిత్రకారుడు పికాసో అభిమాని ఒకరు, ముప్పై యేళ్ళ క్రితం ఆయనకు ఒక చిత్రం గీసి పంపమని ఉత్తరం రాసి, 100 డాలర్ల (1600 రూ॥) చెక్కు జత చేసి పంపారు. పికాసో ఆ చెక్కు వెనకవైపు, నవ్వుతూన్న దయ్యం బొమ్మ గీసి సంతకం చేసి పంపారు. ఆ ప్రత్యేకమైన చెక్కును గత జూన్ 24 న లండన్‌లో 3,960 పౌండ్ల (రూ. 90,000) కు వేలం వేశారు.







## అందరూ ఆడపిల్లలే!

చైనాలోని ఫూకియన్ ఈశాన్య ప్రాంతంలో గౌయాంగ్ అనే గ్రామం ఉన్నది. గత నలభై సంవత్సరాలలో ఆ గ్రామంలో దాదాపు 140 మంది పిల్లలు పుట్టారు. వాళ్ళలో 12 గురు మాత్రమే మగపిల్లలు. మిగతా అందరూ ఆడపిల్లలే। 1976 వ సం॥ నుంచి ఆ గ్రామంలో పుట్టినవాళ్ళందరూ అమ్మాయిలే। అక్కడి వాతావరణానికీ, ఆడపిల్లలు పుట్టడానికీ ఏదైనా సంబంధం ఉన్నదేమో కనుగొనడానికి విజ్ఞానవేత్తలు పరిశోధనలు జరుపుతున్నారు।

# సాహిత్యావలోకనం

1. ప్రముఖ రచయిత ముల్క్‌రాజ్ ఆనంద్ రచించిన ఒక నవలను మొదట ఇంగ్లాండులోని ఇరవై ప్రచురణ సంస్థలు నిరాకరించాయి. ఒక ఆంగ్లేయుడు తొలిపలుకు రాశాక ప్రచురింపబడింది. ఆయన ఎవరు? పుస్తకం పేరేమిటి?
2. మన జాతీయ చిహ్నంలోని 'సత్యమేవ జయతే' అన్న వాక్యాన్ని ఎందులో నుంచి తీసుకున్నారు?
3. నాట్యశాస్త్రం గురించి వివరించే అతి ప్రసిద్ధమైన భారతీయ గ్రంథం ఏది?
4. 'తాకిక్-ఎ-హింద్'ను రచించిన వారెవరు?
5. హిందీ సాహిత్యంలో ఆధునిక నాటకానికి ఆద్యుడయిన భారతేందు హరిశ్చంద్ర రచించిన రెండు సుప్రసిద్ధ రచనలు ఏవి?

## సమాధానాలు

### మీకు తెలుసా?

1. కులూలోయ. ఇక్కడ ప్రతి గ్రామంలోనూ దేవతల విగ్రహాలున్నాయి. దసరా సందర్భంగా వాటన్నిటినీ అలంకరించిన రథాలలో ఊరేగిస్తారు.
2. లాల్‌కోట్, సిరి, తుగ్లకాబాద్, జహాన్‌పనా, ఫిరోజాబాద్, పురానాఖిలా, షాజహానాబాద్.
3. సెయింట్ ఫ్రాన్సిస్ సేవియర్; గోవాలోని కేథడ్రల్ ఆఫ్ బామ్ జీసస్.
4. రాజస్థాన్ రాజధానీనగరం జైపూర్; ఆ నగరాన్ని నిర్మించిన రాజా జైసింగ్ దానిని గులాబీరంగు రాళ్ళతో నిర్మించిన భవనాలతో, ద్వార తోరణాలతో అలంకరించాడు.

### సాహిత్యం

1. ఇ. ఎమ్. ఫార్‌స్టర్; 'అన్‌టచబుల్స్' (1930)
2. 'ముండక ఉపనిషత్'.
3. భరతముని విరచిత 'నాట్యశాస్త్రం'.
4. అల్‌బెరూనీ.
5. 'సత్యహరిశ్చంద్ర' ; 'భారత్ దుర్దశ'



ప్రపంచ పురాణగాథలు - 8

# ప్రథమ కృషీవలుడు!

ఒకానొకప్పుడు టార్టారస్ అనబడే పాతాళ లోకాన్ని పాలించే ప్లూటో, ప్రాస్పర్‌పైన్ అనే అందాల దేవతను చూశాడు. ఆమె అందానికి పరవశుడై, ఆమెను బలవంతంగా ఎత్తుకుని, త్రిశూలంతో సైయాన్ నదిని చీల్చుకుని పాతాళ లోకం చేరాడు.

ప్రాస్పర్‌పైన్ తల్లి సిరీస్ దేవత, తన కుమార్తె కనిపించకపోయేసరికి, విచారంతో కొండలూ, కోనలూ, అడవులూ, లోయలూ అంటూ ఎక్కడెక్కడో వెతికింది. కాని ప్రయోజనం లేక పోయింది.





సిరీస్ దేవత, తీరని విచారంతో ఒక వృద్ధురాలి రూపంలో ఒక గుట్టమీద కూర్చున్నది. తొమ్మిది పగళ్ళూ, తొమ్మిది రాత్రులూ కదలామెదలక అలాగే విచార వదనంతో కూర్చున్న ఆమెను సెలియస్ అనే ఒక పేదవాడూ, అతని కూతురూ చూసి జాలిపడి, తమ ఇంటికి రమ్మని పిలిచారు.



తండ్రి కూతుళ్ళ దయాగుణానికి సంత సించిన సిరీస్‌దేవత వాళ్ళవెంట బయలు దేరింది. మార్గమధ్యంలో, తన చిన్న కొడుకు దీర్ఘకాలంగా తీరని వ్యాధితో బాధపడుతూన్న విషయాన్ని సిలియస్ ఆ దేవతకు వివరించాడు.

ఇంకా మామూలు వృద్ధురాలు లాగానే వున్న, సిరీస్ దేవత వ్యాధిగ్రస్తుడైన కుర్రాణ్ణి ప్రేమతో స్పృశించి, నుదుట ముద్దుపెట్టింది. ఆ క్షణమే పసివాడిలో నూతనోత్తేజం కలిగింది. వాడి ముఖం కళకళలాడింది. తమ బిడ్డ నవ్వు చూసి, తల్లిదండ్రులు అంతులేని ఆనందం పొందారు.





ఆ రోజు రాత్రి అందరూ నిద్రలో వుండగా, సిరీస్ దేవత లేచి, కుర్రవాణ్ణి లేపి, ఏవో మంత్రాలు వల్లించసాగింది. యథాలాపంగా మేలుకున్న కుర్రవాడి తల్లి, ఆ దృశ్యాన్ని చూసి అమితాశ్చర్యం చెందింది.

సిరీస్ దేవత మంత్రం పఠిస్తూ, దాపుల నున్న కుర్రవాణ్ణి బూడిద రాశిమీద పడుకోబెట్టింది. మరుక్షణమే ఆ కుర్ర వాడి తల్లి భయంతో కీచుమని అరుస్తూ, బిడ్డను బూడిద పైనుంచి దూరంగా లాక్కున్నది.





"ఎంతపనిచేశావు తల్లీ! కొంత సేపు ఓర్పు వహించివుంటే మీ బిడ్డను చిరంజీవిని చేసి వుండేదాన్ని. మధ్య లోనే అడ్డు తగిలావు. అయినా, నీ కొడుకు అపురూప ధైర్యశాలిగా పెరిగి ప్రజలకు మేలు చేయుగలడు!" అని చెప్పి సిరీస్ దేవత అక్కడినుంచి వెళ్ళి పోయింది.

ఆ తరవాత కొంత కాలానికి సిరీస్కు, తన కుమార్తె ప్రాస్పర్‌పైన్, ప్లూటోను వివాహమాడి టార్టారస్‌కు రాణి అయిం దన్న సమాచారం అందింది. ఆమె పరిస్థితులను అర్థంచేసుకుని, అపైన విచారించడం మానేసింది.





కొన్నేళ్ళు గడిచాయి. తను విచారంగా వున్నప్పుడు తనపై కనికరం చూపిన పేదవాళ్ళ కుటుంబాన్ని చూడాలనుకుని సిరీస్ అక్కడికి వెళ్ళింది. కుర్రవాడు ఇప్పుడు ట్రిప్టోల్మస్ అన్న పేరుతో సాహస వంతుడయిన యువకుడుగా పెరిగాడు. సిరీస్ దేవత ఆ యువకుడికి, నాగలి ఉపయోగాన్ని, వ్యవసాయాన్ని నేర్పింది. ట్రిప్టోల్మస్ ప్రపంచంలో మొట్టమొదటి రైతు అయ్యాడు!

సిరీస్, ఆ యువకుణ్ణి, రెక్కల జంతువులు పూన్చిన రథంలో వివిధ ప్రాంతాలకు తీసుకు వెళ్ళింది. ట్రిప్టోల్మస్ ఆయా ప్రాంతాల వారికందరికీ వ్యవసాయ పద్ధతులను నేర్పాడు.





ట్రిప్టోల్మస్ తన స్వస్థలంలో సిరీస్ దేవతకు బ్రహ్మాండమైన ఆలయం నిర్మించాడు. కాలక్రమేణా, ఆ ఆలయంలో ఉత్సవాలు భారీ ఎత్తున జరగడం ఆరంభమయింది. ఆ సంప్రదాయాన్ని గ్రీకులు చిరకాలం కొనసాగించారు.



# వికటమైన నవ్వు

చాలా కాలం కిందట, భద్రాచలపు అడవులలో దారిపక్కనే ఒక ఆశ్రమం వుండేది. ఆ ఆశ్రమంలో ఒక యోగి పుంగవుడు తపస్సు చేసుకుంటూ ఉండేవాడు. ఆయన మంచి దృఢశరీరం కలవాడు. నిగనిగలాడే నల్లటి మూరెడు గెడ్డం కలవాడు. ఆ మహానుభావుడి దర్శనం చేసేసరికి ఎవళ్ళకైనాసరే, చెయ్యెత్తి మ్రొక్కుదామనిపించేది.

ఆ యోగీశ్వరుడు ఈ అరణ్యంలోకి ఎప్పుడు వచ్చాడో, ఎలా వచ్చాడో, ఈ ఆశ్రమంఎలా స్థాపించాడో, పిట్టకైనా గుట్టు తెలియదు. తెలియకపోవటంచేత లోకులు తలకొక మాటగా చెప్పుకునేవారు. ఎవరేమనుకొన్నా, ఆయన లోకం ఉద్ధరించటానికి విచ్చేసిన మహానుభావుడని మాత్రం అందరూ నమ్మారు. తరణోపాయం కోసం ఆయనను ఆశ్రయింపజూశారు.

ఐతే, ఆ యోగి పుంగవుడు ఎవరితోనూ మాటాడడు. ఆయన మౌనవ్రతుడు. ఆశ్రమంలో ఎత్తయినమండపంమీదపద్మాసనం వేసుకొని కూర్చొని వుంటాడు. ఆయనకు ఈ ప్రపంచంతో సంబంధమే లేదా అనే అనిపిస్తుంది చూసేవాళ్ళకు. అందుచేత, వచ్చేపోయేవాళ్ళంతా తమకు తోచిన తృణమో పణమో భక్తిపూర్వకంగా ఆ మండపం మీద వుంచి, స్వామికి ఒక్కసారి మ్రొక్కి మరీ పోతూ వుండేవారు.

ఈ విధంగా, దోపిడిదొంగలతో నిండి వున్న ఆ మహారణ్యంలో ఆ యోగీశ్వరుడిమూలానజనసంచారంరోజురోజుకీఎక్కువకాజొచ్చింది. దీని ఫలితంగా అరణ్యప్రాంతంలో దోపిడీలూ, దొంగతనాలూ తగ్గిపోవలసింది. కాని, అలాటిదేమీ కనిపించలేదు సరికదా, అంతకంతకు చోరీలు మరీ ఎక్కువవుతూ వచ్చినై.



ఒకనాటి రాత్రి పదకొండు గంటలకు ఆ మార్గాన ఒక బండి పోతున్నది. ఆ బండిలో ముగ్గురు స్త్రీలూ, ఇద్దరు పురుషులూ, ఒక పిల్లవాడూ ఉన్నారు. ఆ స్త్రీల వంటినిండా ఆభరణాలున్నవి. హఠాత్తుగా ఒక దొంగలనాయకుడు బండిని అటకాయించాడు. వాడి తలగుడ్డ, మెరిసే కనుగుడ్లూ, కోరమీసాలూ, చేత దుడ్డుకర్ర— ఈ వేషం చూస్తే బండిలో వాళ్ళకు పైప్రాణాలు పైనే ఎగిరిపోయేటంత హడలు పుట్టింది. ఒక్కళ్ళకూ నోటమాట పెగలలేదు.

దొంగల నాయకుడు దుడ్డుకర్రతో నేల మీద టక్‌టక్‌మని కొడుతూ, వాళ్లను సమీపించి, "నా మాటలు జాగ్రత్తగా వినండి. నేను వృత్తిచేత దొంగనే. ఐనా, నాదంతా ఒక పద్ధతి. నాకు కావలసింది మీ ధనం. అంతే. ప్రాణాలు కాదు. మాటాడక, నగా నట్రా తీసి ఇక్కడ పెట్టి వేశారంటే మీకేమీ భయం ఉండదు. కాదూ కూడదూ అని, మీరు ఎదురు తిరిగినా, గోల చేసినా, అదుగో ఆ పొదల చాటున వున్న నా జట్టు వాళ్ళు చూశారా, ఆ పదిమందీ వచ్చేసి, చేయవలసిన పని అంతా చేసిపోతారు. ఒక్కసారి వాళ్ళకి సంజ్ఞ చేశానే, మరి చూసుకోండి...." అని హెచ్చరించాడు.

బండిలో వాళ్ళు ఒకసారి ఆ దొంగల నాయకుడు చూపించిన పొదవైపు చూశారు. అందులో భయంకరమైన తలలు కనిపించేసరికల్లా వాళ్ళకు గుండె ఆగిపోయినంత పని జరిగింది. చేసేది లేక పురుషులు తలలు వంచుకొన్నారు. స్త్రీలు తమ నగలన్నీ ఒలిచి నాయకుడి ఎదుట పెట్టారు. అప్పుడు నాయకుడు వారిని "ఇక వెళ్ళండి," అని హెచ్చరించి ఆ ధనం పట్టుకొని అక్కడ నుంచి మాయమయ్యాడు.

తరువాత మరికొంతసేపటికి అదేదారిని ఒక వర్తకుడు కాలినడకను వస్తున్నాడు. యథాప్రకారం దొంగల నాయకుడు

అతడికి అడ్డం వెళ్ళి, "డబ్బా, లేకుంటే నీ ప్రాణం!" అని బెదరించాడు. ఆ వర్తకుడు చాలా మొండివాడూ, యుక్తిపరుడున్నూ. వాడు దొంగ మాటలకు బదులుగా, "ఉన్నది నా వద్ద కొంచెం డబ్బు. ఐతే, అది నాది కాదు." అన్నాడు, నదురూ బెదురూ లేకుండా.

దొంగల నాయకుడు వినిపించుకోలేదు. అప్పుడు వర్తకుడు తన దగ్గిర ఉన్న డబ్బు నాయకుడి చేతులలో పెడుతూ, "పొదల మాటున ఉన్న పెద్ద మనుషుల్లారా—మీ నాయకుడి చేతికి వెయ్యి వరహాలు ఇచ్చాను. మీరు దగాపడక, మీమీ వంతులు గుంజుకోండి." అంటూ కేకపెట్టాడు. ఇలా అరిచిన వర్తకుడికి నాయకుడు దుడ్డుకర్రతో రెండు ఇచ్చాడు. దెబ్బతో వర్తకుడు పారిపోయి, అరణ్యం దాటి ఒక సత్రం చేరుకున్నాడు.

అక్కడ సత్రంలో ఆ సమయాన రాజభటులూ, దండనాయకుడూ విడిసి ఉన్నారు. వర్తకుడు వాళ్ళతో తన సంగతి చెప్పుకొన్నాడు. అప్పుడు రాజభటులు అతనితో, "వాడెక్కడో మాకు చూపవయ్యా. నిమిషంలో పట్టేస్తాం" అన్నారు.

అంతా కలిసి, దొంగలుండే ఆ ప్రాంతానికి చేరుకొన్నారు. రాజభటులు ఒకచోట



దాగివున్నారు. వర్తకుడు ముందు నడుస్తూ, అతని వెంట దండనాయకుణ్ణి మాత్రం తీసుకువెళ్లాడు. ఇద్దరే రావడం గమనించి, దొంగల నాయకుడు వాళ్లను అటకాయించటానికి ముందుకు వచ్చాడు. "డబ్బా! లేదా ప్రాణం! అదుగో, చూశారు కదా పొదల మాటున మా పటాలం!" అన్నాడు, దుడ్డుకర్రతో నేలమీద టకటకమని కొడుతూ.

దండనాయకుడు కత్తిసాము, గరిడీలు నేర్చిన మొనగాడు. వెంటనే ఈల వేసి, దొంగల నాయకుడి పైన కలియబడ్డాడు. వాడిని కింద పడగొట్టి, ఉడుంపట్టు లాగా గట్టిగా పట్టివుంచి, "వీడి పని నే చూస్తా.

మీరు పోయి, ఆ పొదలమాటున పొంచి వున్న వీడి ముఠావాళ్ళ పని పట్టండి!'' అని భటులకు ఆజ్ఞాపించాడు.

రాజభటులు ఉరకలేసుకొంటూ పొదలమాటున పొంచిఉన్న దొంగల ముఠా మీదికి వెళ్ళారు. వాళ్ళలో ఒక్కడూ కదలలేదు, మెదలలేదు, ఎదురుకోలేదు. తప్పించుకోబోలేదు. రాజభటులు వాళ్ళను కర్రలతో కొట్టినా ఎక్కడివాళ్లు అక్కడనే ఉండిపోయారు!

ఇదేమిటా అని పరిశీలించిచూస్తే, ఆ మనుషులుగా కనబడే వాళ్ళంతా వట్టి గడ్డిబొమ్మలు! తలకాయలకు మాత్రం మనుషులకు లాగానే పెద్ద పాగాలు చుట్టి వున్నాయి.

దొంగల నాయకుడి తెలివికి అందరూ ఆశ్చర్యపోయారు.

యోగీశ్వరుడి ఆశ్రమం అక్కడికిదగ్గర లోనే ఉన్నది కనుక, రాత్రికి ఆశ్రమంలో కాలక్షేపం చేద్దామనుకొని అంతావెళ్ళారు. చూడబోతే అక్కడ స్వామి లేడు.

దండనాయకుడి ఆజ్ఞప్రకారం భటులందరూ పోయి ఆశ్రమమంతా గాలింప సాగారు. ఆశ్రమంలో రకరకాల దొంగ సొమ్ములు కొల్లలుగా కనిపించినై. అవన్నీ వాళ్ళు చిక్కించుకొన్నారు. తరవాత ఇంకా బాగా వెతికేసరికి, నిగనిగలాడే మూరెడు నల్లటి గెడ్డం ఒక గోడకు వేలాడుతూ కనబడింది. అందరూ దానిని వింతగా చూడసాగారు.

అప్పుడు చేతులు బంధించబడి వున్న దొంగల నాయకుడు వాళ్ళనుద్దేశించి, ''ఏమిటయ్యా, వింతగా చూస్తున్నారు? అది నా పగటివేషం. ఆ వేషంలోనే నేను మౌనం తాల్చి వుండగా భయంతో నన్ను పూజించి కానుకలు అర్పిస్తున్నారు మీరు. ఇది నా రాత్రి వేషం. ఇప్పుడీ విధంగా సత్కరిస్తున్నారు. ఎన్నాళ్ళు మోసగించినా ఒక రోజు పట్టుబడక తప్పదుకదా! సరే కానీండి. ఇది కాకపోతే-మరో నాటకం! మరొక వేషం!'' అంటూ వికటమైన నవ్వు నవ్వాడు.






రాక్షస స్త్రీలు చెప్పిన మాటలు విని రావణుడికి కోపం వచ్చింది. అతను బలవంతులూ, శూరులూ అయిన రాక్షసులను పిలిచి, హనుమంతుణ్ణి పట్టుకోమని ఆజ్ఞాపించాడు. ఆ రాక్షసులు ఆయుధాలు తీసుకుని హనుమంతుడి మీదికి బయలుదేరారు. వారికి హనుమంతుడు అశోకవన ద్వారం వద్ద కనిపించాడు. వాళ్ళు అతన్ని చుట్టుముట్టారు. అప్పుడు మహాకాయుడైన హనుమంతుడు తోకతో నేలను కొట్టి, గట్టిగా అరిచి, తన భుజం చరుచుకున్నాడు. ఆ ధ్వని లంక అంతటా వినిపించింది.

తరవాత హనుమంతుడు కళ్ళెర్రచేసి, ఇలా అరిచాడు:

"రామలక్ష్మణులకు జయం! రాముడి ప్రాపుగల సుగ్రీవుడికి జయం! కోసల రాజైన రాముడి దాసుణ్ణి! శత్రు నాశకుణ్ణి! వాయు పుత్రుడైన హనుమంతుణ్ణి! చెట్లతోనూ, రాళ్ళతోనూ యుద్ధం చేస్తూ వెయ్యి మంది రావణులను ఎదిరించగలను. రాక్షసులు చూస్తూండగానే లంకా పట్టణం ధ్వంసంచేసి, సీతకు నమస్కరించి, రాముడి వద్దకు పోతాను."

అది విని రాక్షససైనికులు భయపడి కూడా, రాజాజ్ఞ చొప్పున యుద్ధం చేయ నిర్ణయించి, హనుమంతుడి పైన అనేక ఆయుధాలు ప్రయోగించారు. హనుమంతుడు ఆ ద్వారం సమీపంలో ఉన్న ఇనుప పరిఘ తీసుకుని, రాక్షసుల నంద



రినీ చంపి, తిరిగి ద్వారంవద్ద నిలబడ్డాడు. భయపడి పారిపోయిన రాక్షసులు వెళ్ళి రావణుడితో సైనికులు చచ్చిన వార్త చెప్పారు.

రావణుడు మరింత మండిపడి హనుమంతుడి మీదికి మహావీరుడైన ప్రహస్తుడి కొడుకును పంపాడు.

ఈ లోపుగా హనుమంతుడి దృష్టి చైత్యప్రాసాదం మీద పడింది. దాన్ని ఎందుకు ధ్వంసం చెయ్యకూడదనుకుని, అతను దాని పైకి దూకి, దాన్ని నాశనం చేసి, సింహనాదం చేశాడు. ఇంతలో చైత్యప్రాసాద రక్షకులు ఆయుధాలతో అతని పైకి వచ్చారు. హనుమంతుడు ఒక స్తంభాన్ని పెరికి, దాన్ని గిరగిరా తిప్పి, నూరు మంది రాక్షసులను చంపాడు.

ఇంతలోపల ప్రహస్తుడి కొడుకు జంబుమాలి విల్లూ, బాణాలూ తీసుకుని హనుమంతుడి మీదికి గాడిదలు కట్టిన రథం మీద వచ్చాడు. అతన్ని చూడగానే హనుమంతుడు యుద్ధోత్సాహంతో సింహనాదం చేశాడు.

ద్వారం పైన ఉండే దూలం మీద కూర్చుని ఉన్న హనుమంతుడి పైన జంబుమాలి బాణాలు వేశాడు. అవి ముఖానా, నెత్తినా, చేతులకూ తగిలి, రక్తం మూలంగా హనుమంతుడు మరింత ఎర్రగా కనిపించాడు. అతను తన పక్కనే ఉన్న పెద్దరాయి ఎత్తి, జంబుమాలి మీద గట్టిగా విసిరాడు. జంబుమాలి ఆ రాతిని బాణాలతో పడగొట్టాడు. అలాగే అతను హనుమంతుడు విసిరిన సాలవృక్షాన్ని కూడా బాణాలతో నరికి, మరి కొన్ని బాణాలతో హనుమంతుణ్ణి కొట్టాడు. హనుమంతుడు అమితమైన కోపంతో పరిఘను తీసుకుని, గిరిగిరా తిప్పి, జంబుమాలి మీదికి విసిరాడు. దాని దెబ్బకు జంబుమాలీ, అతని రథమూ, గాడిదలూ గుర్తించరాకుండా నుగ్గు అయిపోయాయి.

జంబుమాలి చచ్చాడని వినగానే రావణుడికి కోపంతో కణతలు అదిరాయి. అతను తన మంత్రి పుత్రులను ఏడుగురిని అగ్నిహోత్రాల వంటి తేజస్సుగల వారిని, సైన్యంతోసహా పంపాడు. హనుమంతుణ్ణి నేను చంపుతానంటే, నేను చంపుతానని ఒకరి మీద ఒకరు పోటీలుపడుతూ, వాళ్ళు గుర్రాలు పూన్చిన రథాల మీద బయలుదేరారు.

వాళ్ళు అశోకవన ద్వారం చేరుతూనే హనుమంతుడి మీద బాణవర్షం కురిపించారు. హనుమంతుడు ఆ బాణాలు తనకు తగలకుండానూ, వాళ్ళ గురికి అందకుండానూ ఆకాశంలో అటూ, ఇటూ ఎగిరాడు. అతని అరుపులకు రాక్షసులు భయపడ్డారు. హనుమంతుడు వాళ్ళను చేత్తో కొట్టి, కాళ్ళతో తన్ని, పిడికిలితో పొడిచి, గోళ్ళతో చీరాడు. చాలామంది రాక్షసులు ఇలా చచ్చారు. చచ్చినవాళ్ళు చావగా, మిగిలిన వాళ్ళు ఆర్తనాదాలు చేస్తూ పారిపోయారు.

హనుమంతుడు తిరిగి ద్వారం వద్దకు చేరాడు. అతనికి ఇంకా యుద్ధం చెయ్యాలని ఉన్నది.

మంత్రిపుత్రులు కూడా హనుమంతుడి చేతిలో చచ్చారనే సరికి రావణుడికి కొంచెం భయం కలిగింది. కాని అతను దాన్ని పైకి కనబడనియ్యక, తన సేనానాయకులలో అయిదుగురిని, విరూపాక్షుడూ, యూపాక్షుడూ, దుర్ధరుడూ,





ప్రఘసుడూ, భావకర్ణుడూ అనేవాళ్ళను ఉద్దేశించి, '' మీరందరూ రథాలతోనూ ఏనుగులతోనూ వెళ్ళి ఆ వానరుణ్ణి శిక్షించండి. అతని విషయంలో మీరు ఏ మాత్రమూ అలక్ష్యంగా ఉండవద్దు. అతను వానరుడని నాకు అనిపించటం లేదు. అదేదో మహాబలం గల భూతంలా గున్నది. ఏ ఇంద్రుడైనా తపస్సు చేసి మనని చంపటానికి ఈ భూతాన్ని సృష్టించాడేమో; నాకు లోగడ వాలీ, సుగ్రీవుడూ, జాంబవంతుడూ, నీలుడూ, ద్వివిదుడూ మొదలైన వానరవీరులు బాగా తెలుసు. వారెవరికీ ఇంత బలమూ, శక్తీ లేవు. మీరు మీ శక్తినంతా ధారపోసి ఈ వానరుణ్ణి ఎలాగైనా పట్టుకోండి. ఆత్మరక్షణ చేసుకోవటం విషయంలో మీరు అజాగ్రత్తగా ఉండకండి,'' అని హెచ్చరించాడు.

రాజాజ్ఞ శిరసావహించి అయిదుగురు సేనాపతులూ రథాలనూ, ఏనుగులనూ, గుర్రాళ్ళనూ, రకరకాల అయుధాలనూ తీసుకుని హనుమంతుడున్న చోటికి వచ్చారు. వాళ్ళు హనుమంతుణ్ణి చుట్టుముట్టి, అతని మీద అనేక అయుధాలు ప్రయోగించారు. వాళ్ళ బాణాలు కొన్ని హనుమంతుడి తలకు గుచ్చుకున్నాయి. వెంటనే హనుమంతుడు సింహనాదం చేస్తూ ఆకాశంలోకి ఎగిరాడు. అప్పుడు దుర్ధరుడు ఆకాశంలోకి వందల కొద్దీ బాణాలు వేశాడు. హనుమంతుడు వాటిని తప్పుకుంటూ, శరీరం పెంచి, పిడుగు పడినట్టుగా దుర్ధరుడి రథం మీదికి దూకాడు. ఆ దెబ్బకు దుర్ధరుడి రథపు గుర్రాలు ఎనిమిదితో పాటు దుర్ధరుడు కూడా చచ్చాడు.

తరవాత హనుమంతుడు ఒక మద్దిచెట్టు పెరికి, దానితో విరూపాక్షుణ్ణీ, యూపాక్షుణ్ణీ చంపాడు. తరవాత ప్రఘసుడూ, భావకర్ణుడూ హనుమంతుడితో యుద్ధం చేశారు. ఒక పర్వతశిఖరం పెకలించి, హనుమంతుడు దానితో వారిద్దరినీ, సేననూ చంపాడు.

తరవాత అతను మళ్ళీ ద్వారం వద్ద నిలబడ్డాడు.



అయిదుగురు సేనానాయకులూ చచ్చిన వార్త రాగానే రావణుడు తన కొడుకైన అక్షుడి కేసి చూశాడు. యుద్ధం అంటే అమితమైన ఆసక్తిగల అక్షుడు, తండ్రి చూపే ఆజ్ఞగా భావించి, చప్పున లేచాడు. అతను ఒక బంగారు రథం మీద హనుమంతుడున్న చోటుకు వెళ్ళాడు. ఎనిమిది గుర్రాలుగల అక్షుడి రథం నేలను అంటకుండానే పోగలది. దాని నిండా ఎప్పుడూ ఆయుధాలు ఉంటాయి.

అక్షుడు హనుమంతుణ్ణి చూస్తూనే అతను అసాధారణ వీరుడన్న సంగతి గ్రహించి, పెద్ద ఎత్తున యుద్ధానికి సిద్ధపడ్డాడు. ఇద్దరూ చాలా తీవ్రమైన యుద్ధం ప్రారంభించారు. అక్షుడు వేసిన రకరకాల బాణాలు హనుమంతుడికి తగిలి, అతని యుద్ధోత్సాహాన్ని పెంచాయి. అతను ఆకాశంలోకి ఎగిరాడు. అక్షుడు కూడా తన రథంతోపాటు ఆకాశంలోకి లేచి, హనుమంతుడి మీద బాణాలు వేయసాగాడు. హనుమంతుడు వాటిని తప్పుకుంటూ ఆకాశంలో తిరుగుతూ, అక్షకుమారుణ్ణి చంపే మార్గం ఆలోచించాడు. చిన్నతనంలోనే ఇంత పరాక్రమం గల అక్షుడు, చంపకుండా విడిచిపెడితే, ముందు ముందు ఎంతైనా బాధిస్తాడు. అందుచేత, హనుమంతుడు ఉపాయంగా, తలవని తలంపుగా, అక్షుడి కాళ్ళు పట్టుకుని, గిరగిరా తిప్పి, బలంగా నేలకేసి కొట్టాడు. ఆ దెబ్బకు అక్షుడు చచ్చిపోయాడు.

అక్షుడి చావు వినగానే రావణుడికి దుఃఖమూ, కోపమూ కూడా కలిగాయి. ఆయన దుఃఖాన్ని అణచుకుని, తన కొడుకైన ఇంద్రజిత్తును చూసి, "ఈ వానరుడు ఇప్పటికి జంబుమాలినీ, మంత్రి పుత్రులనూ, అయిదుగురు సేనాపతులనూ, చాలా సేననూ, నీ తమ్ముడైన



అక్షుణ్ణి చంపాడు. అందుచేత అతని బలం సరిగ్గా అంచనా వేసుకుని యుద్ధం చెయ్యి. నువ్వు యుద్ధంలో నా అంత వాడివి, దేవతలను కూడా జయించ గలవు. నువ్వు సేనలను తీసుకుపోవద్దు; నీ అస్త్రాలను మాత్రమే నమ్ముకో. నిన్ను నువ్వు తేలికగా రక్షించుకోగలవని పంపుతున్నాను,'' అన్నాడు.

ఇంద్రజిత్తు తండ్రికి ప్రదక్షిణ చేసి, యుద్ధానికి బయలుదేరాడు. అతను రథం మీద వెళ్ళి త్వరలోనే హనుమంతుణ్ణి చేరుకున్నాడు. ఇంద్రజిత్తు రావటం చూసి హనుమంతుడు సంతోషంతో సింహనాదం చేశాడు.

ఇంద్రజిత్తు తన పైన బాణాలు వెయ్యనారంభించగానే, హనుమంతుడు ఆకాశంలోకి ఎగిరి, ఆ బాణాలను తప్పుకుంటూ సంచరించసాగాడు. తాను వేసిన ఒక్క బాణమూ హనుమంతుడికి తగలకపోయేసరికి ఇంద్రజిత్తు చిరాకు పడ్డాడు. హనుమంతుణ్ణి చంపటం అసాధ్యమని అతనికి తెలిసిపోయింది. కనీసం హనుమంతుణ్ణి పట్టుకునే ఉద్దేశంతో అతను బ్రహ్మాస్త్రం సంధించాడు. దానితో హనుమంతుడు కట్టుపడి, ఆకాశంలో నుంచి కింద పడిపోయి, ఏమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయాడు.

తాను బ్రహ్మాస్త్రంతో పట్టుబడ్డట్టు హనుమంతుడు గ్రహించాడు. ఏ అస్త్రంచేతా పట్టుబడకుండా బ్రహ్మదేవుడు తనకు వరం ఇచ్చి ఉన్న సంగతి జ్ఞాపకం తెచ్చుకుని, హనుమంతుడు కొంతసేపు బ్రహ్మాస్త్రానికి కట్టుబడి ఉండ నిశ్చయించాడు. తనను, బ్రహ్మ, దేవేంద్రుడూ, వాయువూ రక్షిస్తారుగనక ప్రమాదం కలగదని కూడా అతను నమ్మాడు. అదీగాక ఇప్పుడు తనకు రావణుడితో మాట్లాడే అవకాశం కూడా కలుగుతుంది.

కదలకుండా పడి ఉన్న హనుమంతుణ్ణి రాక్షసులు సమీపించి, అతన్ని తాళ్ళతో బంధించారు. హనుమంతుడు బంధించ

బడగానే బ్రహ్మాస్త్రం అతన్ని వదిలేసింది. ఇతర బంధాలున్న చోట బ్రహ్మాస్త్ర బంధం నిలవదు. ఇంద్రజిత్తు ఈ సంగతి ఎరిగి ఉండడంచేత, అజ్ఞానులైన రాక్షసులు హనుమంతుణ్ణి నారతాళ్ళతో బంధించి నందుకు విచారించాడు. అయితే రాక్షసులు తనను తీసుకుపోతున్నప్పుడు కూడా, తనను బ్రహ్మాస్త్రం విడిచిన సంగతి హనుమంతుడెరగడు.

రాక్షసులు హనుమంతుణ్ణి కర్రలతో కొట్టుతూ, పిడికిళ్ళతో పొడుస్తూ, విజయోత్సాహంతో కేకలు పెడుతూ రావణుడి వద్దకు తీసుకుపోయారు.

ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి రావణుడికీ, సభికులకూ చూపి, "ఇతనే ఆ వానరుడు," అని పరిచయం చేశాడు. మదించిన ఏనుగులాగున్న హనుమంతుణ్ణి చూసి, రావణాసురుడి సభలో వాళ్ళు తమలో తాము, "ఎవడీ వానరుడు? ఎవరి తరఫున వచ్చాడు? ఇక్కడికి ఎందుకు వచ్చాడు? ఏం పని మీద వచ్చాడు? ఈ లంకలో ఎవరితో, పని ఉండి వచ్చాడు?" అంటూ ఒకరినొకరు ప్రశ్నించుకున్నారు.

రావణుడి సభలోకి రాక్షసులు తీసుకు వచ్చిన హనుమంతుడు ఒక్కసారి రావణుడి కేసి, అతని చుట్టూ ఉన్న రాక్షసుల కేసి చూశాడు. రావణుడి కళ్ళు కోపంతో ఎర్రబడి ఉన్నాయి. అతను ఆజ్ఞాపించిన మీదట అతని మంత్రులు హనుమంతుణ్ణి ఇలా అడిగారు:

"నువ్వు ఇక్కడికి ఎందుకు వచ్చావు? నిన్ను ఎవరు పంపారు?"

"నేను వానర రాజైన సుగ్రీవుడి దూతను. అతను పంపగా వచ్చాను," అని హనుమంతుడు జవాబిచ్చాడు.

"ఇక్కడికి ఎందుకు వచ్చాడో, అశోకవనాన్ని ఎందుకు ధ్వంసం చేశాడో, రాక్షస స్త్రీలను ఎందుకు భయపెట్టాడో, మన సైనికులతో యుద్ధం ఎందుకు చేశాడో అడుగు," అని రావణుడు ప్రహస్తుడితో అన్నాడు.





# దేవతాసర్పం

కలవగుంటు అనే గ్రామంలో, పార్వతమ్మ అనే సంపన్నురాలుండేది. ఆమెకు నలుగురు కొడుకులు. భర్త పోయినప్పటి నుంచీ, తల్లీతండ్రీ తానే అయి, వాళ్ళను ఆప్యాయంగా పెంచి పెద్దచేసి, పక్కన వున్న పట్నంలో వాళ్ళచేత పెద్ద బట్టల దుకాణం ఒకటి పెట్టించింది. తర్వాత కొడుకులు నలుగురికీ తగిన సంబంధాలు చూసి పెళ్ళి చేసింది.

పార్వతమ్మ మనసు మంచిదే కానీ, తగని పిసినారి. ఇంట్లో లక్షలు మూలుగుతున్నా, పైసా ఖర్చుపెట్టడానికి కటకటలాడిపోయేది. తిండికూ్కడా సరిగా ఖర్చుపెట్టనిచ్చేదికాదు. ఆమె మనస్తత్వానికి కొడుకులయితే అలవాటు పడిపోయారు కానీ, కోడళ్ళకు మాత్రం చాలా బాధగా వుండేది. వాళ్ళు పిండివంటలకూ్కడా మొహం వాచిపోయారు. భర్తలకు చెప్పుకున్నా ఫలితం లేకపోవడంతో, వాళ్ళు తమలోతాము మనస్తాపం చెందసాగారు.

ఎప్పుడైనా అత్తగారు ఏ ఊరైనా వెళితే, అప్పుడు తమ కిష్టమైన పిండి వంటలన్నీ చేసుకు తినాలనుకునేవారు. అయితే, పార్వతమ్మ ఒక పట్టాన ఎక్కడికీ వెళ్ళేదికాదు.

ఒకసారి, పార్వతమ్మకు పక్క ఊళ్లోనే వున్న తమ్ముడి దగ్గరనుంచి కబురొచ్చింది. ఆమె మర్నాడు ప్రయాణం పెట్టుకున్నది. ఆ క్షణం నుంచీ కోడళ్ళ ముఖాలు వెలిగిపోయాయి. కళ్ళతోనే మాట్లాడుకున్నారు; గుసగుసలాడుకున్నారు.

తెలివైన పార్వతమ్మ ఇదంతా గ్రహించింది. అయినా, ఏం తెలియనట్టు అమాయకంగా వుండిపోయింది.

ఆ రాత్రి పార్వతమ్మ పడుకున్న తర్వాత, నలుగురు కోడళ్ళూ పెరట్లోని

రావినూతల సువర్ణాకన్నన్

నటించి వాళ్ళ మాటలన్నీ అత్తగారు చాటు నుంచి విన్నదన్న సంగతి, పాపం వాళ్ళకు తెలియదు.

తెల్లవారుతూనే పార్వతమ్మ, తమ రెండెడ్లబండిలో ప్రయాణమై వెళ్ళి పోయింది. ఆమె ఎప్పుడు వెళ్తుందా, ఎప్పుడు పిండివంటల ఏర్పాటు చేసు కుందామా అని ఎదురు చూస్తున్న కోడళ్లు నలుగురూ, ఆమె వెళ్ళిన కాస్సేపటికే, తమకు కావలసిన సరుకులన్నీ తెప్పించు కున్నారు. గారెలకు పప్పు నానబోసు కున్నారు. నాలుగు కూరలూ, నాలుగు పచ్చళ్ళూ, పప్పుచారులాంటివి తయారు చేసి, భర్తల విస్తళ్ళలో వడ్డించారు.



తులసికోట దగ్గిర సమావేశమయ్యారు. ఇంట్లో అత్తగారుండని రెండు రోజులూ, తమ కిష్టమైన వంటకాలన్నీ చేసుకు తినెయ్యాలని నిర్ణయించుకున్నారు. పెద్ద కోడలు తనకు నేతిగారెలు తినాలని వున్నదన్నది. రెండో కోడలు తనకు జీడి పప్పుపాకం అంటే ప్రాణం అన్నది. నాకు కోవాకజ్జికాయలంటే ఇష్టం అన్నది మూడో కోడలు. హల్వాపూరీలంటే, అబ్బ! అంటూ నాలుక చప్పరించింది నాలుగో అవిడ.

ఇలా మాట్లాడుకుని, ఎవరి గదుల్లోకి వాళ్ళు వెళ్ళి పడుకున్నారు. మర్నాడు తినబోయేవాటి గురించి ఆలోచిస్తున్న వాళ్ళెవరికీ నిద్రరాలేదు. అయితే, నిద్ర

వాళ్ళకు చాలా రోజుల తర్వాత మంచి భోజనం చేస్తున్నామని ఆనందంగా వున్నా, తల్లికి తెలిస్తే ఏమంటుందో అని హడలి పోసాగారు. అయితే, నలుగురు కోడళ్ళూ వాళ్ళకు రకరకాలుగా నచ్చజెప్పి, అత్త గారికి ఈ సంగతి చెప్పమని, వాళ్ళ నుంచి వాగ్దానాలు తీసుకున్నారు.

అన్నదమ్ములు నలుగురూ పట్నానికి ప్రయాణమయ్యాక, కోడళ్ళు పిండివంటల పని ప్రారంభించారు. ముందుగా నెయ్యి కరిగించారు. తర్వాత పప్పు రుబ్బారు. ఇక పొయ్యి వెలిగిద్దామనుకుంటూండగా, ఎవరో వీధితలుపు తట్టిన శబ్దం అయింది.

పెద్ద కోడలు వెళ్ళి తలుపు తెరిచి చూస్తూనే కొయ్యబారిపోయింది. ఎదురుగా అత్త పార్వతమ్మ!

పార్వతమ్మ చేతిలో ఒక బుట్ట పట్టుకుని ఆయాసపడుతూ, "అబ్బ, ఏం ఎండలు! ఏం ఎండలు! ప్రయాణం అర్థాంతరంగా ఆపుకుని తిరిగి రావలసొచ్చింది." అంటూ లోపలి కొచ్చింది.

అత్తగారి గొంతు వింటూనే, కోడళ్ళు నిలువునా వణికిపోతూ మైదా రవ్వ, పంచదార లాంటివన్నీ గబగబా దాచేసి నడవాలోకి వచ్చారు.

"ఏమిటే, ఈ నేతివాసన?" అన్నది పార్వతమ్మ ముక్కుపుటాలు పెద్దవి చేస్తూ.

"అబ్బే, ఏం లేదత్తయ్యా! నెయ్యి అయిపోతే వెన్న కరగబెట్టా." అన్నది పెద్ద కోడలు.

మిగతా ముగ్గురు కోడళ్ళూ ఆమెకు వంత పాడారు.

"అన్నట్టు—నెయ్యంటే గుర్తొచ్చింది! మధ్యలోనే ఆగిపోయిన, నా ప్రయాణంలో ఒక తమాషా జరిగింది." అన్నది పార్వతమ్మ, దగ్గిర్లో వున్న కుర్చీలో కూర్చుంటూ.

"ఏమిటా తమాషా, అత్తయ్యా!" అంటూ కోడళ్ళు నలుగురూ ఆమె చుట్టూ చేరారు.

"నేను మన బండిలో బయలుదేరానా—సరిగ్గా మా తమ్ముడి ఊరుకు





ఇవతల వున్న అడవి చేరేసరికి, అక్కడ మన ఎద్దుల్లో ఒకదాని కాల్లో పెద్ద ముల్లొకటి గుచ్చుకున్నది. దాంతో అది కాలు తీసి కాలు వేయలేకపోతూంటే, పాలేరు ముల్లు తీసేందుకు పూనుకున్నాడు. నేను అంత దూరంలో వున్న, ఒక పాడుబడ్డ మండపం దగ్గిర కెళ్ళాను, కాసేపు కూర్చుందామని. చిత్రంగా అక్కడ నేతి గారెలవాసన గుప్పున కొట్టింది!'' అంటూ క్షణం ఆగింది. పార్వతమ్మ.

నేతిగారెల మాట వింటూనే తుళ్ళిపడి సర్దుకున్నది పెద్ద కోడలు.

పార్వతమ్మ చిన్నగా నవ్వి, ''సంగతేమిటో తెలుసుకుందామని, నేనటుకేసి బయలుదేరాను. కొద్ది దూరంలో పెద్దపెద్ద కోవాకజ్జికాయల్లాంటి గుడ్లు కొన్ని కనిపించాయి. అవి దేనిగుడ్లో అర్థం కాక, మరి కాస్త ముందుకు నడిచాను. అంతే, నా గుండె దడదడలాడింది!'' అని ఆగింది పార్వతమ్మ.

''అక్కడ ఏం కనిపించింది, అత్తయ్యా?'' అని అడిగింది, కోవాకజ్జికాయల మాట వినగానే అదురుకున్న మూడో కోడలు, తన అదురును కప్పిపుచ్చుకుంటూ.

''ఆఁ, అదే చెప్పొస్తున్నాను. అక్కడ ఒక గోధుమవన్నె తాచు పడగవిప్పి ఆడుతున్నది. దాని పడగ ఎలా వున్నదనుకున్నారు? ఇంత పెద్దగా—అచ్చం హల్వా పూరీలా నిగనిగలాడిపోతున్నదనుకోండి!'' అన్నది పార్వతమ్మ.

''తర్వాతేం జరిగిందత్తయ్యా?'' అని నీరసంగా అడిగింది, హల్వాపూరీలంటే తగని ఇష్టం అనే నాలుగో కోడలు.

''వినండి మరి! ఆ పామును చూసేసరికి, నా గుండె ఆగినట్టయింది. వెనక్కు తిరిగి పారిపోదామా అనుకునేంతలో, అక్కడి కొక సాధువు వచ్చాడు. ఆయన చేతిలో అరిటాకుల్తో చుట్టిన పెద్ద పొట్లం వున్నది. కంగారు పడుతున్న నన్ను చూసి ఆయన చిరునవ్వునవ్వి—అది దేవతా

సర్పమనీ, అదున్నచోట నేతిగారెల వాసన వస్తుందనీ, దాని పడగ అచ్చం హల్వాపూరీలా వుంటుందనీ, దాని గుడ్లు ఇతర పాముల గుడ్లలా కాక, చాలా పెద్దవిగా, చూడ్డానికి కోవాకజ్జికాయల్లా వుంటాయనీ చెప్పాడు. తర్వాత ఆయన తన చేతిలోని పొట్లం విప్పి, పాము ముందర పెట్టాడు. అదేమిటనుకున్నారు? బంగారం రంగులో వున్న జీడిపప్పు పాకం!" అన్నది పార్వతమ్మ.

"జీడిపప్పు పాకమా ?" అని తడారి పోయిన గొంతుతో అని, వెలవెల పోయింది, అది ఇష్టమని చెప్పిన రెండో కోడలు.

"అవును! ఆ దేవతాసర్పం దాన్ని వాసన చూశాక, ప్రసాదంగా స్వీకరిస్తాడట సాధువు." అన్నది పార్వతమ్మ.

ఇంత విన్నాక కోడళ్ళు నలుగురికీ, తాము వేసిన పథకం అత్తగారికి తెలిసి పోయిందనీ, అందుకే, ఈ పాము కథ అల్లిందనీ తెలిసిపోయింది. వాళ్ళు నలుగురూ క్షమించమంటూ, అత్తగారి పాదాల మీద పడిపోయారు.

పార్వతమ్మ ఆప్యాయంగా అందర్నీ లేవదీసి, "అది సరేగాని, ముందు ఈ బుట్టలో ఏమున్నదో బయటికి తీయండి," అన్నది ఆజ్ఞాపిస్తున్నట్టు.

కోడళ్ళు బుట్టలోని వాటిని బయటికి తీశారు. వాళ్ళకు ఎంతో ఆనందం, బుట్ట నిండుగా వాళ్ళ కిష్టమైన పిండివంటలు!

ఆనందాశ్చర్యాలతో తన కేసి చూస్తున్న కోడళ్ళతో, పార్వతమ్మ, "క్షమించాల్సింది నేను కాదు; మీరే నన్ను క్షమించాలి. కొండంత సంపద వున్నా, మిమ్మల్ని తిండికూ్కడా మొహం వాచేలా చేశాను. ఉన్నది అనుభవించడానికి కాకపోతే మరెందుకు? ఈనాటి నుంచీ మీకేం కావాలన్నా నిర్భయంగా, నిస్సంకోచంగా చేసుకుతినండి. నాకూ్కడా ఇంత పెట్టండి," అన్నది.

అత్త మాటలకు కోడళ్ళు ఎంతగానో మురిసిపోయారు.





# చేప నవ్వింది!

ఒకనాడు కాశ్మీరులో ఒక చేపలమ్ముకునేది రాజభవనానికి వెళ్ళింది. రాణిగారు చేపలు బేరం చేస్తూండగా బుట్టలోని చేపల్లో ఒకటి ఎగిరెగిరి పడసాగింది.

"నాకు ఆడచేపలు కావాలి. ఆ చేప మగదా, ఆడదా?" అని రాణి అడిగింది.

రాణిగారు ఆ మాట అడగగానే చేప పెద్దగా నవ్వింది. చేపలమ్మే మనిషి తన దగ్గిర అన్నీ మగచేపలేనని చెప్పింది. రాణి ఆ మనిషిని పంపేసింది. కాని తనను చూసి ఒక చేప నవ్వటమా అన్న ఆగ్రహంతో రాణిగారు కోపగృహం ప్రవేశించింది.

రాజుగారు ఆమె కోపకారణం తెలుసుకున్నారు. మంత్రిని పిలిపించారు. "ఒక సామాన్యపు చేప; రాణిగారిని చూసి నవ్విందట. దీనికి కారణం ఏమిటో నెల లోగా తెలుసుకోలేనిపక్షంలో నీతల తీయించేస్తాను," అని హెచ్చరించాడు.

మంత్రి గుండెల్లో రాయిపడింది. ఆయన విచారంతో ఇంటికి వెళ్ళాడు. ఎందరో మేధావులనూ, జ్యోతిష్కులనూ, యోగులనూ, మాంత్రికులనూ తన ఇంటికి రప్పించి, "ఒక సామాన్యపు చేప రాణీగారిని చూసి నవ్వింది. దీనికి కారణం ఏమై వుంటుందో మీరెవరైనా చెప్పగలరా?" అని అడిగాడు.

ఒక్కరూ చెప్పలేకపోయారు. దానితో మంత్రికి తనకు చావు తప్పదనిపించింది. ఆయన మనోవ్యాధితో మంచమెక్కాడు.

మంత్రి కుమారుడు చాలా తెలివి గలవాడు. తండ్రికి కావలసిన సమాధానం కొరకు తానే స్వయంగా బయలుదేరాడు. అతను కొన్ని రోజులు ప్రయాణం చేశాక దారిలో ఒక ముసలి రైతు తటస్థపడ్డాడు.

కాశ్మీర జానపదకథ



ఆ రైతుతోబాటే మంత్రి కుమారుడు కూడా నడవసాగాడు.

కొంతదూరం పోయాక మంత్రి కుమారుడు రైతుతో, "మనం ఇలా నడిచేకన్న ఒకరి భుజాల మీద ఒకరిని మోసుకుంటూ పోతే ఇద్దరికీ నడక సులువవుతుంది గదా! ఏమంటావు?" అన్నాడు.

రైతు అతనికి సమాధానం చెప్పలేదు. తన వెంట వచ్చే కుర్రాడికి మతి సరిగా లేదు కాబోలని మాత్రం మనసులో అనుకున్నాడు.

మరికొంత దూరం పోయాక మంత్రి కుమారుడు కోతకు సిద్ధంగా వున్న చేనొకటి చూసి, "దీనినింకా తిని వెయ్యలేదే మబ్బా?" అని అడిగాడు.

దానికీ రైతు జవాబు చెప్పలేదు. ఈ మాటతో రైతు అనుమానం మరింత ఎక్కువయింది.

ఇంకొంత దూరం పోయాక ఒక అడవి వచ్చింది. మంత్రి కుమారుడు రైతుకు తన బాకు తీసి ఇచ్చి, "ఇది తీసుకుపోయి రెండు గుర్రాలు తీసుకురాగలవా? మనకు ఉపయోగపడతాయి. బాకు మాత్రం పోగొట్టవద్దుసుమా! చాలా ఖరీదైనది," అని చెప్పాడు.

దానికి కూడా రైతు ఏమీ జవాబు చెప్పలేదు. తనతో ఈ విధంగా మాట్లాడే కుర్రవాడికి నిజంగా పిచ్చేనని రూఢి మాత్రం చేసుకున్నాడు.

అడివి దాటి ఇద్దరూ ఒక నగరం ప్రవేశించారు. ఆ నగరంలోని వారెవరూ వీరిని పలకరించలేదు. మంత్రి కుమారుడు చుట్టూ చూస్తూ, "ఎంత పెద్దశ్మశానమో!" అన్నాడు.

ఈ మాటకు రైతు నవ్వుకున్నాడు.

నగరం దాటుతూనే వారిద్దరూ శ్మశానం దగ్గిరికి వచ్చారు. శ్మశానంలో శవదహనం జరుగుతోంది. చచ్చిపోయినవాడి బంధువులు వచ్చే పోయేవారికి ఏవేవో తినుబండారాలిస్తున్నారు. వీరిద్దరికీ కూడా ఇచ్చారు.



దానికి మంత్రి కుమారుడు, "మీ ఇంటికి అలాగే వస్తాను గాని, మీ ఇంటి వాసాలు బలమైనవో కావో ఆలోచించుకుని మరీ పిలవండి!" అన్నాడు.

"ఈ పిచ్చివాడితోటి మాట్లాడటమే తప్పు!" అనుకొని రైతు తానొక్కడే ఇంటికి వెళ్ళాడు. తన భార్యకూ, బిడ్డలకూ తన వెంట వచ్చిన పిచ్చి కుర్రవాణ్ణి గురించిన సంగతి వివరంగా చెప్పాడు.

రైతు కూతురు చాలా తెలివిగలది. తండ్రి చెప్పినదంతా విన్న తరవాత ఆ పిల్ల అతడితో ఈ విధంగా అన్నది:

"నాన్నా, ఆ కుర్రవాడు పిచ్చివాడు కాడు. చాలా తెలివిగలవాడు. అందుకే అతని మాటలు నీ కర్థం కాలేదు. ఒకరి భుజాల మీద ఒకరిని మోసుకుంటూ పోదా మనటంలో అతని ఉద్దేశం ఒకరికొకరు కథలు చెప్పుకుంటూ నడుద్దామని! పొలాన్నింకాతినివెయ్యలేదేమబ్బాఅంటే, రైతులకు సామాన్యంగా ఉండే అప్పుల వాళ్ళు పంట కాజెయ్యలేదేమిటా అని! బాకు తీసుకుపోయి రెండు గుర్రాలు తీసుకురమ్మనటంలో అతని ఉద్దేశం రెండు దుడ్డుకర్రలు నరుక్కురమ్మనీ, అవి అడవిలో ఏదైనా వస్తే అండగా ఉంటా యనీనూ! నగరంలో ఎవరూ పలకరించ నందున అది అతనికి శ్మశానంలా కని

రెండడుగులు వేసి మంత్రికుమారుడు, చుట్టూ కలయజూసి, "ఇది ఎంత దివ్య మైన నగరం!" అన్నాడు.

కొద్దిదూరంలో వాగు ఒకటి అడ్డొచ్చింది. రైతు చెప్పులు చేత పట్టుకొని, ధోవతి పైకి కట్టుకొని వాగు దాటాడు. మంత్రి కుమా రుడు మటుకు ఇదేదీ చేయకుండానే వాగు దాటాడు.

ఎలాగైతేనేం రైతు గ్రామం చేరు కున్నాడు. తన వెంట వచ్చిన యువకుడు ఎంత వెర్రివాడైనా, చాలాదూరం తన వెంట కలిసి నడిచాడు గనక రైతు అతన్ని తన ఇంటికి భోజనానికి రావలసిందిగా పిలిచాడు.

పించింది; శ్మశానంలో ఆతిథ్యం దొరికింది గనక దాన్ని నగరం అన్నాడు! వాగు దాటేటప్పుడు నీటిలో ఏముంటుందో తెలీదు గనక అతను పాదరక్షలు విప్పలేదు. ధోవతి పైకి కట్టలేదు! అతను చాలా తెలివైనవాడు. మన ఇంటి వాసాలు బలమైనవని చెప్పి ఉంటే తప్పక వచ్చేవాడు. ఇల్లు తనను భరిస్తుందో లేదోనని తెలుసుకొనడానికే ఆయన అలా అడిగాడు. నే నాయనకు ఆతిథ్యం ఇస్తానుండు!''



రైతు కూతురు ఒక చిన్న గిన్నెనిండా నెయ్యీ, పన్నెండు చపాతీలూ, ఒక దుత్తనిండా పాలూ, నౌకరు చేతికిచ్చి మంత్రి కుమారుడికి పంపిస్తూ, ఒక చిన్న ఉత్తరంలో ఈ విధంగా రాసింది:

''మిత్రమా, చంద్రుడు సంపూర్ణుడు. సంవత్సరానికి పన్నెండు నెలలు. సముద్రుడు చెలియలికట్టను దాట యత్నిస్తున్నాడు.''

రైతు కూతురిచ్చిన వస్తువులను నౌకరు మంత్రి కుమారుడి వద్దకు తీసుకు పోతూండగా, నౌకరు కొడుకు దారిలో తటస్థపడి, తండ్రివద్ద మారాం చేసి కొంత పదార్థం కాజేశాడు. నౌకరు మిగిలినవాటిని తీసుకుపోయి మంత్రి కుమారుడి కిచ్చాడు.

మంత్రి కుమారుడు భోజనం పూర్తి చేసి, రైతు కూతురు పంపిన చీటి తీసుకుని, దానికి సమాధానం నౌకరు ద్వారా ఇలా పంపాడు:

"స్నేహితురాలా! అమావాస్య చంద్రుడు కావటం చేత అతని జాడే తెలియదు. ఏడాదికి పదకొండు మాసాలేనని నాకు తోస్తోంది. సముద్రంలో నీరు సగానికి తీసి వుంది.''

ఈ సమాధానం వినగానే రైతు కూతురు నౌకరుతో, ''నేనిచ్చిన నెయ్యీ, ఒక చపాతీ, సగం పాలూ ఏం చేశావు?'' అని అడిగింది. దొంగతనం బయట పడిపోయింది.

ఆ తరవాత ముసలిరైతు వెళ్ళి మంత్రి కుమారుణ్ణి తన ఇంటికి పిలుచుకొని

వచ్చాడు. మంత్రి కుమారుడూ, రైతు కూతురూ చాలాసేపు మాట్లాడుకున్నారు. చివరకు మంత్రి కుమారుడు రైతు కూతురుతో, రాణీగారిని చూసి చేప నవ్విన వృత్తాంతం పూసగుచ్చినట్టు చెప్పి, "ఆ చేప అలా నవ్వటానికి కారణం ఏమై వుంటుంది?" అని అడిగాడు.

"రాణీగారి అంతఃపురంలో ఎవరికీ తెలియకుండా ఒక పురుషుడు నివసిస్తూ ఉండాలి!" అన్నది రైతు కూతురు.

మంత్రి కుమారుడు ఎంతో ఆశ్చర్యపడి, "ఈ విషయం నిజమైతే రుజువు చేయటానికి నువ్వు నాకు తోడ్పడగలవా? నా తండ్రి ప్రాణం కాపాడినదానవవుతావు!" అన్నాడు.

సరేనని రైతు కూతురు మంత్రి కుమారుడి వెంట బయలుదేరింది. ఇద్దరూ ఇంటికి తిరిగి వచ్చారు. రైతు కూతురు చెప్పిన మాటలు విని మంత్రి సంతోషించి రాజుతో చేప నవ్వుకు గల కారణం చెప్పేశాడు.

"దీనికి రుజువు?" అని అడిగాడు రాజు.

"రాజనగరులో ఒక వెడల్పయిన కందకం తవ్వించండి. దాని మీదుగా రాణీగారి పరిచారికలను దూకమని శాసించండి," అని సలహా ఇచ్చింది రైతు కూతురు.

ఆ ప్రకారంగానే కందకం తవ్వి, రాణీగారి దాసీలందరినీ దూకమన్నారు. ఎవరూ దూకలేకపోయారు. ఒకతె మాత్రం ధైర్యంగా ముందుకు వచ్చి దూకింది.

"ఆ మనిషి స్త్రీ కాదు. పరీక్షించండి," అన్నది రైతు కూతురు. ఆమె చెప్పినట్టే రుజువయింది. ఆ మనిషి స్త్రీ కాదు, స్త్రీ వేషంలో అంతఃపురంలో ప్రవేశించిన పురుషుడు. మోసాన్ని బయటపెట్టినందుకు రాణీగారు చాలా సంతోషించింది. ఆ పురుషుణ్ణి తగినవిధంగా శిక్షించారు.

రాజుగారు మంత్రికి గొప్ప బహుమతి ఇచ్చి, మంత్రి కుమారుడికీ, రైతు కూతురుకూ వైభవంగా వివాహం జరిపించారు.






రాక్షసబల్లులనబడే డినోజార్లన్నీ ఆకారంలో అతి పెద్దవైనవి మాత్రమే కావు. వీటిలోనూ చిన్నవి ఉండేవి. చూడడానికి పక్షి లాగా కనిపించిన అతి చిన్న డినోజార్ పొడవు 2 అడుగులు మాత్రమే।

## పొంచివుండే ప్రమాదం!



మంచుగడ్డలకూ, సముద్ర జలాలకూ సాంద్రతలో మరీ కొద్ది తేడా మాత్రమే వుంటుంది. అందువల్ల మంచుగడ్డలు దాదాపు ఎనిమిదింట ఏడువంతులు నీళ్ళ లోపల మునిగే వుంటాయి.

## ముళ్ళజెముండు విందు!

గ్యాలాపగోస్ దీవులలోని ఒకరకం నేల ఉడుములు ముళ్ళజెముళ్ళను, వాటి ముళ్ళతో సహా హాయిగా తినేస్తాయి!



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1991 అక్టోబర్ నెల సంచికలో ప్రకటింపబడును.



G. Srinivasamurthy



J. Sarojini

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) ★ ఆగస్టు నెల 15 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. ★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం. ★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: – చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

### జూన్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో: చేస్తున్నా అమ్మలా! రెండవ ఫోటో: చూస్తున్నా బొమ్మలా!

పంపినవారు: కనకాల వరలక్ష్మి, C/o. ఆర్. సూర్యనారాయణ, సామర్లకోట రోడ్, కాకినాడ—533 004 (ఆం.ప్ర)

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.




Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISHWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

# Cuddles always say "I love you."

Show your little ones how much you love them! And is there a better way of doing that than giving them a huggable, cuddlable playmate?

Cuddles. From the people who have given children the delightful entertainer of a magazine, Chandamama. Cuddles. A whole new range of stuffed toys. And, your old favourites. And, cute surprises being introduced regularly. Each one a sweet, adorable companion to your child. Absolutely safe. Designed to withstand childhandling.

Well, the fun and excitement of the festive season is just round the corner. Make it memorable for your child with a special gesture. With a Cuddle.

- CUDDLES — Stuffed toys from Chandamama.
- SAMMO — Mechanical and electronic toys from Chandamama

**CUDDLES**

Manufactured in technical collaboration with Sammo Corporation, South Korea

**CHANDAMAMA TOYTRONIX**

Chandamama Toytronix Private Limited, Chandamama Buildings, Vadapalani, Madras - 600 026

*from*

**THE HOUSE OF**

**CHANDAMAMA**

**CUDDLES AND SAMMO TOYS WILL BE AVAILABLE AT ALL LEADING TOY OUTLETS EXCEPT IN THE STATES OF ASSAM, HIMACHAL PRADESH, MADHYA PRADESH AND NORTH EASTERN STATES**